# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

ప్రథమ [ప్రత్యేక] వార్షికోత్సవ సంచిక

సంపుటము 2 — రాజమహేంద్రవరము 1-11-1978 — సంచిక 1




## —* ఈ సంచికలో *—



—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.
వార్షిక సంచిక రు 1-00

# సమాలోచన



ప్రథమ [ప్రత్యేక] వార్షికోత్సవ సంచిక

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 1-11-1978 | సంచిక 1


## స్వవిషయము

వి. టి. జె. కాలేజి అధ్యాపక పదవీ విరమణానంతరం పత్రికమూలంగా కొంత సాహితీసేవ చేయాలనే కోరిక కలిగింది. సాధక బాధకాలూ, సాధ్యతాసాధ్యతలూ, లాభనష్టాలూ ఆలోచనలోకి రాలేదు. కొన్ని మంచి ఆశయాలని మనసులో పెట్టుకొని 1-11-77 న 'సమాలోచన' ప్రారంభించడం జరిగింది.

సహృదయులైన కొందరు రచయితలూ, మిత్రులూ, పాఠకులూ, ఇస్తూన్న ఆదరాభిమానాలు చేయూతగా ఒక సంవత్సరం కొంతవరకు సంతృప్తికరంగానే కొనసాగింపగలిగితిని. అనుకొన్న మంచి ఆలోచనల్ని ఎన్నిటిని ఎంతవరకూ నిర్వహింపగలిగితినన్న విషయానికి సహృదయ పాఠకులే ప్రమాణం.

ప్రత్యేకాభిమానంతో విజ్ఞులైన రచయితలు కొందరు తమ అమూల్యాలైన రచనలు పంపి పత్రిక పుష్టివంతంగా ఉండటానికి దోహదం చేస్తూన్నందుకు వారికి కృతజ్ఞతలు తెలుపుకోవడం కనీస ధర్మంగా భావిస్తున్నాను.

రచయితలూ, చందాదారులూ, సాహిత్యాభిమానులూ, ఇదేవిధంగా అధిక సహకారం అందించగలరనీ, ఇంకనూ ఉన్నత ప్రమాణాలతో క్రమాభివృద్ధితో పత్రికను నడపకలుగుతాననీ ఆసిస్తున్నాను.

### వి. టి. కాలేజీ అధ్యాపకుల సమస్య - పరిష్కారము.

వి. టి. కాలేజీల అధ్యాపకుల సమ్మె అధ్యాపకులకూ, విద్యార్థులకూ, తృప్తికరంగా పరిష్కారం ఐందన్న వార్త సంతోషదాయకంగా వుంది.

వీరేశలింగంపంతులుగారి కృషికి ఆయన జీవితకాలంలోనే ఎన్ని ప్రతిఘటనలూ ప్రతిబంధకాలూ కలిగినవి అనే సంగతి చరిత్ర తెలిసినవారికి సుస్పష్టం.

ఆయన పేరుతో విద్యాశాలలు గతదశాబ్దంనుండి మూడుపువ్వులాఱుకాయలుగా వర్ధిల్లినసంగతి ఎవ్వరూ కాదనలేని సత్యం. అత్యున్నత విద్యావంతుడు కాకపోయినా ఈ అభివృద్ధిలో శ్రీ మేడూరి సత్యనారాయణగారి పాత్ర అత్యంత ప్రధానం అయింది అన్న సంగతీ తిరుగులేనిది. అధ్యాపకులూ అన్నివిధములా తమ అర్హతని ఋజువుచేసికొని ఏతత్సంస్థల అభివృద్ధిలో భాగస్వాములైన సంగతీ సత్యేతరం కాదు.

ఇక ఎవరిది ఎంతపొరపాటు ? అన్నది ఈ దశలో చర్చించడం మా అభిమతం కాదు. కాని జరగకూడని సంఘటనలు ఇటీవల కొన్ని జరగిపోయినవి. విద్యార్థుల కృషికి అంతరాయం కలిగింది. ఏతద్విద్యాసంస్థలతో ముప్పదేండ్ల అనుబంధం కలిగిన అస్మదాదులకీ సంఘటనలవల్ల పరితాపం కలగడం అసహజం కాదు.

విద్యాసంవత్సరం చెడకుండా తరుణం మరీ మించిపోకుండా విజ్ఞత చూపి యాజమాన్యమూ అధ్యాపకులూ విద్యార్థులూ ప్రశాంత పరిస్థితికి వచ్చినందుకు వారందఱూ అభినందనీయులు. ఇక యాజమాన్యానికీ విద్యార్థులకీ అధ్యాపకులకి సంతృప్తికరంగా స్థిరపరిష్కారం జరగాలని ఆసించడం విజ్ఞులందఱి కర్తవ్యమూను.

### చిక్‌మగళూరు ఉపఎన్నిక.

కర్నాటకలోని ఒక సామాన్య నియోజక వర్గంలో జరిగే ఉపఎన్నికకి కనీవినీ ఎఱుగని ప్రాముఖ్యం రావడాని కారణం సువిదితం.

గత జనరలు ఎన్నికలలో నామ రూపాలులేకుండా పార్టీతోసహా పతనం చెందిన శ్రీమతి ఇందిరాగాంధీ; ఎమర్జన్సీ కాలంలో అనేక [illegible] జరగ

డానికి బాధ్యురాలని భావింపబడిన ఇందిర, ప్రజాస్వామ్యాన్ని సర్వవిధాల కాలరాచి కఠినశిక్షార్హమైన అనేక - నేరాలు చేసినట్లు ఆరోపింపబడిన ఇందిర, పార్లమెంటుకి పోటీచేసే ఉద్దేశం లేదని పెక్కుపర్యాయాలు ఘోషించిన ఇందిర, పార్లమెంటు ప్రవేశానికి చేసే గాఢప్రయత్నమే ఇది కావడం దీని ప్రత్యేకత.

స్వాతంత్ర్యం వచ్చింతర్వాత జరిగిన అనేక - ఎన్నికల్లో మహానాయకులనేకులు ఓడడం, సామాన్యులనేకులు గెలవడం అందరికీ ఎఱుకలోనిదే. ఒకప్పుడు పోటీలేకుండానూ పోటీలలో లక్షల వోట్ల మెజారిటీతోనూ గెలిచినవారే ఇంకొకప్పుడు డిపాజిట్లు కోల్పోయినసంగతీ ఎఱుగనిదికాదు.

కాని ఔచిత్యం తప్పిన అసత్యప్రచారం, దూషణభూషణలూ, నేడు పరాకాష్ఠకు జేరినట్లు వార్తలు సూచిస్తున్నాయి. కొన్ని పార్టీల, ప్రముఖవ్యక్తుల ఊసరవెల్లి రంగులూ బయలు పడుతున్నాయి. తర్కానికి ఎంతమాత్రం నిలవని ఉక్తిప్రత్యుక్తులూ, వినబడుతున్నాయి. మహానాయకుల పసిపిల్లల మనస్తత్వం, కళ్ళు మూసికొని పాలుతాగుతూ తన్నెవరూ గుర్తించరు అనుకొనే పిల్లిమనస్తత్వమూ వెల్లడిఅవుతున్నాయి. పరిశుద్ధమైన ప్రజాస్వామ్య తత్వంలో అంతర్గతంగా ఇంత కాలుష్యం పేరుకుని వుంటుందా అనిపించకమానదు. ఇందులో ఎవరు గెలిచినా ఎవరు ఓడినా భారతదేశ రాజ్యాంగ పరిస్థితులలో మిన్నువిరిగిమీదపడే మహాపరివర్తన ప్రళయం ఏమీ సంభవించదు కాని కొన్ని మేక వన్నె పులుల వికృతరాజకీయ చాతుర్యంవేసే వేత్తితలల నగ్నతాండవం ఒకసారి పెల్లుబికి చల్లారడం మాత్రమే జరగుతుంది.

— సంపాదకుడు.

---

'సమాలోచన' క సంవత్సరమునిండిన శుభసందర్భమును పురస్కరించుకొని పంపిన

—* కొన్ని సందేశములు *—

శ్రీ క్రొవ్విడి లింగరాజు,
మాజీ పార్లమెంటరీ సెక్రెటరీ, మాజీ మునిసిపల్ చైర్మను, బహుళ రచయిత, దానవాయిపేట, రాజమండ్రి.
10-10-78.

సమాలోచనకు సంవత్సరం నిండినందుకు సంతోషిస్తున్నాను. మొదటి కొద్ది సంచికలు మినహా ప్రతిసంచికను నేనెంతో శ్రద్ధగా పూర్తిగా చదివి ఆనందిస్తున్నాను. పుస్తకాల సమీక్షను చదివితే మూలగ్రంథాలను చదవాలనే ఆసక్తి కలగాలి. అదృష్టితో మాస్తే సమాలోచనలోని సమీక్షలు,విమర్శలు,నాకెంతో ఆనందాన్ని కల్గించాయి.

'రీడర్సు డైజెస్టు' వలె సమాలోచన కూడా దినాదినాభివృద్ధి చెంది తెలుగుదేశమంతటా వ్యాపిస్తుందని ఆశిస్తున్నాను. 'సమాలోచన'కొత్తసంవత్సరంలో కొత్త శిఖరికలతో వెలువడాలని నా కోరిక.

శ్రీ డా॥ సి. నారాయణరెడ్డి,
హైద్రాబాదు. 20-10-78.

'సమాలోచన' ప్రతీ సంచికా చదువుతున్నాను. సాహిత్య పత్రికలు తెలుగులో చాలా తక్కువగా ఉన్నాయి. ఉన్నవాటిలో ఎన్నదగిన పత్రిక 'సమాలోచన' మీరువ్యక్తి ప్రాధాన్యానికి గాక, విషయగౌరవానికి విలువున్న వ్యాసాలను ప్రచురించడం ఎంతో సంతోషకరం.

మీపత్రిక నిరంతరంగా నడవాలని ఆశిస్తున్నాను.

శ్రీ డా॥ వి.వి.ఎల్. నరసింహారావు
ఎం ఏ., పిహెచ్.డి.
గవర్నమెంటుకాలేజి. మాచర్ల.
12-10-78

'సమాలోచన పుట్టి నిండ సంవత్సరముకాలేదు. అప్పుడే సాహిత్యజగత్తులో సమాలోచనా సంచలనము పుట్టించినది. తెనుగునాట ఉండవలసినన్ని మంచి సాహిత్యపత్రికలు లేవన్నకొరతను కొంత వరకైన 'సమాలోచన' తీర్ప గలుగుచున్నది. సంపాదకులును, రచయితలును, పత్రికను దిద్దితీర్చి ఆవిష్కరించుచున్న తీరు పఠితలకు ఆనందోపదేశముల నందించుచున్న దనుట నిస్సంశయము.

శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తి,
జర్నలిష్టు, బహుభాషావేత్త, రాజమండ్రి.

'సమాలోచన'పత్రిక సాహిత్య సమాలోచన విషయంలో అన్వర్థంగా హిత సహితమైన ఆలోచనామృతదాయకమైన సమీక్షాప్రక్రియను ప్రారంభించింది. ఆంధ్ర పత్రికా ప్రపంచంలో అనన్యమైన ఈదృశసేవను ఇతోధికంగా ఈ పత్రిక కొనసాగించాలని దైవాన్ని ప్రార్థిస్తున్నాను. ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా నాశుభాకాంక్షలందిస్తున్నాను.

శ్రీ డా. ఉప్పలపాటి శ్రీరామ
మూర్తి, ఎం ఏ పిహెచ్.డి.
గవర్నమెంటు కాలేజి, కందుకూరు.

తెలుగు సాహిత్యసేవకయి అవతరించిన నిత్యసౌగంధిక ప్రసూనం'సమాలోచన'. సాహిత్యమథనం తాత్త్విక జీవన సౌధానికి సోపానం. స్వచ్ఛమయిన సాహిత్యపువిలువలను పుణికిపుచ్చుకొన్న సద్విమర్శనాత్మక వ్యాసములతో,ఉన్నత శ్రేణికి చెందిన సమీక్షలతో 'సమాలోచన' ఎత్తైన శిఖరాలను చేరుకుంది.

ఎన్నోవ్యయ ప్రయాసలకోర్చి 'అచ్చమయిన సాహిత్య పత్రిక'ను స్థాపించి, దానిని దినదిన ప్రవర్థమానంగా రూపొందిస్తూ, జిజ్ఞాసువులకందరికీ తృప్తిని చేకూరుస్తూన్న విద్వాన్ శ్రీబులుసు సీతారామ శాస్త్రిగారు ధన్యులు. ప్రశంసనీయులు. వారికి ఆయురారోగ్య సంపదలను ప్రసాదింప వలసినదిగా భగవంతుని ప్రార్థిస్తున్నాను.

*

# సాహిత్య లక్ష్యం

— శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

జీవితానికి లక్ష్యం ఏమిటి? అని ప్రశ్నిస్తే, ఒకటికాదు పది, పదికాదు లక్ష, సమాధానాలు లభిస్తాయి. వ్యక్తి, వర్గము, జాతి, దేశము, సంస్కృతి వీటినిబట్టి సమాధానాలు ఉంటాయి. అందులో ఆనందం, సత్యాన్వేషణ, మోక్షం, వంటి ఉదాత్తమైనవే కావు, ధనం, కీర్తి, అధికారం, ఇంద్రియసుఖం, వంటివి కూడా ఉంటాయి. సాహిత్య లక్ష్యంగా ఇవన్నీకూడా ఎప్పుడో ఒకప్పుడు పేర్కొనబడినవే. కాని జీవితం—సాహిత్యం ఒకటి కావు! జీవితంలో ఒక సాధనగా సాహిత్య సృష్టీ, ఒక సాధనంగా సాహిత్యాధ్యయనమూ సాహిత్యలక్ష్యాన్ని నిర్దేశిస్తాయి.

సాహిత్య మంటే: సృజనాత్మక సాహిత్యం—కావ్యం, నాటకం, నవల, కథ అని ఇక్కడ నిర్వచనం. 'సాహిత్యం జీవితం యొక్క ప్రతిబింబం' అంటారు కొందరు. ఇది సరికాదు. జీవితానికి లేని నిర్దిష్టమైన ఆకృతి, సాహిత్యంలో రచనకు ఉన్నది. అందుకే రచన జీవితానికి ప్రతిబింబం కాదని అనడం. పోతే "జీవితానికి ఒక వ్యాఖ్యానాన్ని ప్రతిపాదించేది సాహిత్యం' అనే సూత్రీకరణం ఉన్నది. (Poetry is the criticism of life). దీని అంగీకరించడంమూ కష్టమే. ఏమంటే వ్యాఖ్యానాన్ని ప్రతిపాదించేది మీమాంస లేక దర్శన మౌతుంది. సాహిత్యానికి రచయిత ఉద్దేశించేది నిర్దిష్టమైన అర్థమే కావచ్చు. కాని రచనగా ఆకృతి తాల్చిన తరువాత దానికి రచయిత ఉద్దేశంతో సంబంధం లేక పోవచ్చును. సృజనాత్మక సాహిత్యంలో రచయిత ఉద్దేశమూ, రచన పఠితల్లో కలిగించే అనుభూతి అర్థమూ వేరుగా ఉండవచ్చు. రచయిత కేవలం వాచ్యార్థ ప్రధాన మైన రచన చేస్తే దానికి సాహిత్యపు విలువరాదు. సాహిత్య రచన వ్యంగ్యప్రధానమైన సృష్టి. అంతేకాదు. జీవితంలో తన అవసరాన్ని బట్టి, ధనమూ కీర్తి వంటి లక్ష్యం కోసమో, లేక మనస్సులోని దుఃఖాన్నీ, దుర్గంధీ, వదలించుకోవడానికో; లేక కేవలం ఆనందం కోసమో చేసిన రచన, ఆలక్ష్యమునకు విరుద్ధమూ, ఆ మనఃస్థితికి భిన్నమూ ఐన చిత్రమైన ఫలితాల్ని లోకంలో సాధించ వచ్చు. అందుకే రచయిత లక్ష్యమూ, రచనలక్ష్యమూ, విధిగా ఏకీభవించ వలసిన అవసరం లేదు!

పోతే, పఠిత దృష్ట్యా సాహిత్య రచనసాధించే లక్ష్యాన్ని గూర్చి ఆలోచిస్తే — పఠితల సంస్కారాన్ని బట్టి, జీవితానుభవాన్ని బట్టి, సాహిత్య ప్రయోజనం ఎన్నోవిధాలుగా ఉంటుంది. కొన్ని రచనలు తన్మయ భావాన్నీ, రసానుభూతినీ కలిగిస్తాయి. కొన్ని వైరస్యాన్నీ, విరక్తినీ కలిగిస్తాయి. ఈ అనుభూతికీ, జీవితం ప్రసాదించే అనుభూతికీ, పోలికలూ, విభేదాలూ ఉంటాయి. కొందరు ఆ పోలికల కోసం సాహిత్యాన్ని చదువుతారు. కొందరు అనుభూతిలో భిన్నత్వాన్ని, వైవిధ్యం, కోరి చదువుతారు. అలా జీవితానుభూతిని పౌనః పున్యంగానూ, నవనవోన్మేషంగానూ, స్మరణీయం

( తరువాయి 3 వ పేజీలో )

జాషువా కావ్య నీరాజనం

# "రాష్ట్రపూజ"

— శ్రీ డా. జి. బి. ఎన్. ఆచార్య, ఎం. ఏ., పిహెచ్.డి.

దేశభక్తికి స్వధర్మము, ఋతము, మూలభూతములైన విషయములు. వేద ఋషులు పాడుకొనిన నదీసూక్తము, పృథివీసూక్తము, మున్నగునవి దేశమాత బాహ్యస్వరూప కీర్తనముయొక్క లక్షణములు. భారతదేశము కర్మభూమి. కర్మాచరణమునకు దేశభక్తి మూలసత్త్వమని వారు గమనించిరి 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అను ప్రాచీనసూక్తి ఈ విషయమునే అభివ్యక్తము చేయుచున్నది. ఆధునిక కవులు గానమొనర్చిన దేశభక్తిమాత్రము జాతీయభావమునుండి పుట్టినది.

సాహిత్యమునకు దేశభక్తి పుష్టినిచ్చును. సాహిత్యము దేశభక్తిని ఉద్దీపింపజేయును. జాతీయజీవితమునకు సాహిత్యము ప్రతిబింబమే కనుక, కడచిన నూరేండ్లనడుమ భారతీయ సాహిత్యములో దేశభక్తి ఒక ప్రధాన కథావస్తువై కమనీయ కావ్యముల అవతరణమునకు కారణమయ్యెను.

ఆధునికాంధ్ర కవిత్వములో దేశభక్తి రెండుపాయలుగా ప్రవహించినది. ఒకటి భారతజాతీయాభిమాన సంబంధి; రెండవది ఆంధ్రాభిమానసంబంధి. జాషువగారి యాంధ్రాభిమానము యావద్భారతాభిమానమునకు అడ్డురాలేదు. భారత పరివ్యాప్తమైన అభిమానము ఆంధ్రాభిమానమునకు అవరోధమును కలిగింపలేదు. 'రాష్ట్రపూజ' అను కావ్యమునందు రాష్ట్రమాత దీర్ఘసింహాసనము వేసికొనుటకు గాను పలుతావులను వర్ణించుచు, అందు అనువైన యేదియో ఒకతావునందు వసింపవలసినదిగా కోరినారు.

'ఆదిలో నీజన్మ కంకురార్పణచేసి,
పోరాడినట్టి గుంటూరునందో,
బహువిశాలాంధ్ర దేవత గుండెకాయయై
భాసిల్లు విజయవాడ యందో,
మఱియాద గల రెడ్డిదొరలు వాసము చేయు
సిరిగల నెల్లూరు సీమయందో,
పూసపాటి ద్విజభూపుల విక్రమజ్యోతు
లలరు కళింగ రాజ్యంబునందో
నేడు నీవున్న కర్నూలు నేలయందో
నాల్గుమూలల తెలుగు నందనుల యందు
కలత లెడబాపి, వసతులు గలుగుచోట
వేసికొనుమమ్మ! దీర్ఘ సింహాసనంబు'
అనుచు ఇంకను —
'ఇచ్చోట, రాలిపోయినది క్షాత్రవీర
దంతిదంతాల ముత్యాల సరకు,
ఇచ్చోట, పండిపోయినది కొమ్మన పట్టి,
దివ్యలేఖిని జగా తెలుగు కైత
ఇచ్చోట, నిలిచిపోయినవి నాగార్జునా
చార్యుని ప్రాచీన చైత్యనిధులు,
ఇచ్చోట, చిందిపోయినది సీతావిప్ర
యోగి రాఘవుని యశ్రూదకంబు,
అవసరమువచ్చెగాన పూర్వాంధ్ర గాథ
తలచుకొందుము స్వకుచమర్దనము గాదు
నీవు నచ్చిన నగరాన నిశ్చలముగ
కట్టుకొనవమ్మ! కలికి బంగారు మహలు.'

అని వీరు పూర్వాంధ్ర గాథను తలచుకొని పులకరించిపోయిన దేశభక్తులు.

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ! బహుజన్మతపఃఫలమ్!'

'స్వస్థాన వేషభాషాభిమతాః సన్తో
రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యన్తే
వైకృత కావ్యాని చాన్య దపహాయ!'

అని ప్రాచీనసూక్తులు. ఆంధ్రభాషాభిమానమును పూర్వకవులు కావ్యరచనారూపమున నిరూపించిరి. భాషాభిమానమును వెల్లడించుచు —

'తెలుగు శబ్దమహిమ, తెలుగుధీ గరిమంబు,
తెలుగు ధర్మనిరతి తేటపడగ,
ప్రభవమందియున్న ప్రత్యేక వీరాంధ్ర
రాష్ట్రమునకు కోటి ప్రణతి పూజ'

అని తెలుగు భాషయొక్క గొప్పతనమును వర్ణించినారు. ఇంకను ఆంధ్రకవిత్వము ఉండవలసిన తీరును చెప్పుచు —

"ఛందోబద్ధముగా, శ్రవస్సుఖముగా
జాతీయ శబ్దాలలో
నందంబుల్ దొలుకాడు నాంధ్రకవనం
బట్లాంధ్ర వంశంబులో
... ... అని వివరించినారు"

'నిజము వక్కాణింప నీతల్లిభాషతో
ప్రతి చెప్పగాజాలు భాష లేదు'

అని మాతృభాషను కొనియాడినారు. దేశభక్తి కవిత్వమునందు ఆంధ్రరాష్ట్రభావన ప్రధానాంశమై యున్నది.

'మూడుకోట్ల తెల్గుపుత్రుల పటురక్త
నాడులందు నీతలాడినావు
సడ్డ కష్టములను పాటింప మిఁక చేతి
కందినావు, రాష్ట్రసుందరాంగి!'

అని ఆంధ్రరాష్ట్రావతరణానంతరము తమహర్షమును వెలిబుచ్చుచు, శ్రమకుతగిన ఫలము లభించినదని తృప్తిచెందినారు. అందఱును భక్తిపరులు గారు. నిస్స్వార్థపరులు గారు. నమ్మినబంట్లు గారు. ఆప్తహితులు గారు. కనుక నీవు మోసపోక, ప్రజల సౌఖ్యములకు భంగము రాకుండ తేరు నడపువారిని ఏరుకొనుము, అని రాష్ట్రాంగనను హెచ్చరించినారు. ఇంకను హితోపదేశము చేయుచు స్వీయవిద్యలు చుట్టబెట్టి, మోసులు పేని, గోత్రములు బిగియించుకొనెడివారు, ప్రగతి నరికట్టు మంత్రతంత్రముల చేత చింతకాయల పతనమాశించువారు, మున్నగువారందరును నీకుపకరింపరు, అని తెలియజెప్పినారు. మానవాభ్యుదయము నూహించి, చాటిచెప్పిచనిన మేటిమునులు సంతసింపగ

వశాలాంధ్ర చక్రమును నడుపుకొనవలసినదిగా హితవును బోధించినారు. రాష్ట్రమాత కరుణ కలిగియున్నచో తెలుగు దేశమునకు తిండికి,బట్టకు తక్కువేమియు కలుగదని అభ్యుదయము నూహింపగలిగినారు.

'సంగమింపగ రాదుజలధియందొక చుక్క
  దివ్యాంధ్ర మధుర నదీ జలంబు,
జారిపోరాదు సస్య శ్యామలము గాక
  దేశాన కడకు బెత్తెడు పొలంబు
తపియింపగూడ దంధః క్షామ హతిఁజేసి
  పని చేయగల కూలి వాని డొక్క
యాచింపరాదు గృహచ్ఛిద్ర దుఃఖాన
  మృదులాంధ్ర విమల సాహిత్యలక్ష్మి
రాయ వేశ్యాభుజంగుని రాజ్యమందు
ననుభవించిన భోగ భాగ్యములు మరల
కోరుచున్నారు ప్రజలు నీ గొడుగునీడ
ప్రతిభ గలిగిన నవ్యాంధ్రరాష్ట్రలక్ష్మి!'

అని రాయలనాటి సుఖజీవనమును, శాంతి సౌభాగ్యములను మరల నవ్యాంధ్రరాష్ట్రలక్ష్మి గొడుగునీడన పొందవలయునని కాంక్షించినారు. రాయల యుగము స్వర్ణయుగమని కదా చరిత్ర ప్రసిద్ధి. అట్టి స్వర్ణయుగమునే జాషువగారు కోరుటలో ఎంతేని సామంజస్యము గలదు. 'విశ్వశ్రేయః కావ్యమ్' అను సూక్తి ననుసరించి ప్రజల శ్రేయస్సును, అభివృద్ధిని కవిగా జాషువగారు కాంక్షించి తమ ధర్మమును నిర్వర్తించినారు. నరహంతకులను, స్వార్థపిశాచములను ఏ విధముగా శిక్షించి, మానవతను కాపాడి సుఖశాంతి సస్యమును మొలిపించెదవో యనిరాష్ట్రలక్ష్మికి కర్తవ్యోన్ముఖురాలినిగా జేసినారు.

పొట్టి శ్రీరాములు ఋషితుల్యుడు. ఆయనకు కృతజ్ఞతలు చూపుట భావ్యమని 'తుమ్మల' వారి హితోపదేశము
'జగమహాహో! యన శ్రీరామనగర మనెడు
పేరు మనరాచవీటికిఁ బెట్టవలదె ?
ఇంతమాత్ర కృతజ్ఞత యేని దెలుప
రట్టి! తెల్గువలంతు లాపొట్టిఋషికి?'
  —'రాష్ట్ర గానము'

ఒక్క ఋషిమాత్రమే కాడు. స్వార్థ త్యాగముతో సకలాంధ్ర శ్రేయస్సు కొరకు ఆత్మార్పణము గావించిన మేటి వీరుడు. ఆంధ్రప్రజల హృదయదర్పణములందు చెరిగిపోని శాశ్వత ప్రతిబింబమై నిలిచియున్న చిరంజీవి, జాషువగారు తమ కావ్యములో రాష్ట్రదీక్షామహాయోగి యైన పొట్టిరాముని ఆత్మ బలిదానమును స్మరించుచు -

'భక్షించితివి రాష్ట్రదీక్షా మహాయోగి
  పొట్టిరాముని రక్తభోజనంబు'
అని రాష్ట్రమాతకు నివేదించుచు -
'నిండు ప్రాణమిచ్చి నిన్ను పుట్టించిన
బ్రహ్మలందు మిన్న రాములన్న'

అని పొట్టి శ్రీరాముని ప్రశంసించినారు.

'పొలయుచున్నెత్తురు నేఁ బదెన్మిది దినం
  బుల్ క్షుత్పిపాసాగ్నిలో
బలిగావించిన పొట్టి రాముల యన
  ల్పత్యాగ మమ్మాకుకొం
డలలింగాల గదల్ప, దిగ్విజయ ఘం
  టారావముల్ సేయుచున్
జిలుగుంబల్కుల తెల్గురాష్ట్ర మరుదెం
  చెన్ నేడు పుట్టింటికిన్.'

అని తెలుగు రాష్ట్ర మరుదెంచుటకు పొట్టిరాముల అనల్పత్యాగమే కారణమని ఆ సత్యాగ్రహవీరుని తమ కావ్యములో చిరంజీవిని చేసినారు.

'పట్టి మాటలేల, పుట్టినింటికి నీవు,
కదలి వత్తువన్న క్షణమునుండి
యననుభూత పూర్వ మైన చైతన్యంబు
వెల్లిగొనెను తెల్గువీథులందు.'

అని రాష్ట్రసుందరాంగికి స్వాగతమును పలికి తమహర్షమును ప్రకటించినారు. 'రాష్ట్రపూజ' ను సలిపి తమ దేశభక్తిని వెల్లడించిన జాషువగారు అభ్యుదయకాముకులలో అగ్రగణ్యులు.

దేశభక్తి కవిత్వము ప్రాచీనమున అంతర్గతమును, ధార్మికచ్ఛాయలు గలిగినదియును, కాగా; నవీనమున ప్రత్యేకముగ నొకశాఖగ నేర్పడినదియును, రాజకీయచ్ఛాయలు గలిగినదియును, అయియున్నది. జాషువగారి దేశభక్తి కవిత్వమునందు ధార్మికచ్ఛాయలు, రాజకీయచ్ఛాయలు, రెండును మేళవించుకొని యున్నవి. ఈ మేళవింపు జాషువగారిలో నున్న సంప్రదాయ నవ్యతల సమన్వయ ధోరణిని చాటుచున్నది.

---

( 1 వ పేజీ తరువాయి )

గానూ, నియమిత పరిధిలో పరిశీలనకు అనువైన పరిధిలో, అందుబాటు లోనికి తెచ్చే సాధనం సాహిత్యం. భాషతో పాటు దృశ్యాలు కూడా ఆధారంగా ఇటువంటి లక్ష్యాన్నే సినిమా, టీ.వీ. కూడా నెరవేర్చవచ్చు. జీవితానుభూతిని భాషా ప్రక్రియలో నిక్షేపిస్తుంది సాహిత్యం. జీవితం ఆభాస కాదు. జీవితానుభూతిని మించిన సత్యం లేదని చెబుతుంది సాహిత్యం. సైన్సుకూ, ఫిలాసఫీకి, ఏ మేధాగతమైన అన్వేషణకూ లొంగని జీవితరహస్యాన్ని (the mystery of life) నిక్షేపించి అందించడమే సాహిత్య లక్ష్యం. *

# రామకృష్ణుని కవిత - వాస్తవికత

— శ్రీ మఱ్ఱి వెంకటనరసింహారెడ్డి

సామాన్యముగా క్షేత్ర తీర్థ మహాత్మ్య ప్రతిపాదకమైన కథలన్నియు స్కాంద బ్రహ్మాండ పురాణాంతర్గతములై యుండును. రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్య మను ప్రబంధమును స్కాంద పురాణాంతర్గతమైన కథల సంపుటియే. మూలకథల నెన్నుకొనుటయందు మెలకువ వహించినతీరు రామకృష్ణుని నాన్యతో దర్శనీయమైన ప్రతిభకు తార్కాణ. రామకృష్ణుడు సామాజిక స్వభావ చిత్రణ కనుగుణముగా నిగమశర్మోపాఖ్యానమును రచించె ననుట సాహసము గాదు. తక్కిన కథలుకూడ కేవల భక్తి తత్పరతాభావ ప్రకటన మొనరింపజాలినవే యయ్యు సామాజిక చిత్రణము చేయుట యందుకూడ సామర్థ్యము కలిగియున్నవి. అయ్యును నేటికవే ప్రత్యేకత నాపాదించుకొనినవి. ఈ ఉపాఖ్యానోద్దిష్ట ప్రయోజనముకూడ క్షేత్రమాహాత్మ్య ప్రబోధకమే యయినను లోకసామాన్యేతివృత్తమయిన ఈకథయందు ,ఆచారవ్యవహారాద్యనేక విషయములకు జెందిన వాస్తవిక చిత్రణమునులోకులభాషలో చెప్పిన మహాకవి శబ్దవాచ్యుడు తిక్కన మనీషి తరువాత రామకృష్ణుడు తప్ప లేడు. తెలుగు నుడికారపు సొంపు, తెలుగు పదముల తెల్లదనపు వింగడింపు రామకృష్ణుని గంటమునుండి దుసికిల్లిన దుర్లభ మాణిక్య సంహతి.

పలువురాధునికుల అభిప్రాయమున ప్రాచీన గ్రంథమండలి యందు వాస్తవిక ధోరణిలే దను దురభిప్రాయము గలదు. కాని అది యంత యుక్తిసహమగు మాట కాదు. ఆయా గ్రంథముల యందు వారివారి అవతారికోక్త్యసారముగా ఒకనిర్దిష్ట ప్రయోజనము నుద్దేశించి స్వవచో వ్యాఘాతము లేశములు లేకుండగ గ్రంథగ్రథన మొనర్చిరి. అంతియ కాని (మనమనుకొనినటుల) వాస్తవిక ధోరణికి అడ్డము పట్టుదుమనివారు చెప్పికొనలేదు. అయినను ఎడనెడ కథానుసారముగ ఔచిత్యభంగము వాటిల్లని పట్టుల ఏతత్కాలానుగుణమైన సంప్రదాయమును నిక్షిప్తపరిచిరి. అట్టి అవకాశమును సంపూర్ణముగా కలిగియున్నది నిగమశర్మోపాఖ్యానము. ఆనాటి సామాజిక లక్షణమునకు అక్షయ్యప్రాయముగ రచించుట రామకృష్ణుని లోకజ్ఞతకు చక్కని నిదర్శనము. అదియే ప్రస్తుత వ్యాస విషయము.

వాస్తవికతను చెప్పుట యనునది (1) సంస్కృత సమాసభూయిష్ఠమై (2) తెలుగు పదములలో తేటయై (3) సంస్కృతాంధ్ర పదముల సరసమైన సంగమంతో తెలుగు వెలుగును పుట్టించునదై మూడు విధముల మనసాహిత్యమునందు కాననగును పరిశీలింప రామకృష్ణుడు మూడవ విధమునందు ముచ్చటపడినట్లు అవగతమగుచున్నది. కథా ప్రారంభముననే_

ఉ: 'ప్రాసగు విత్తువంటి నెఱి
పాఱుకోలంబున బుట్టి వేదముల్
వ్రాసిన గాదె శాస్త్రములం
పుట్టినయిల్లు కళాకలాపముల్
డాసిన రచ్చ... ..... ..' (3_3)

ప్రాసగువిత్తు - రాజనపువరి విత్తు; గాదె - ఉగ్రాణము, ధాన్యాగారము, 'పాతర(underound godown)' అని బులుసువారు. రచ్చ - సభ; పల్లెటూళ్ళయందు తగవులు పరిష్కరించి తీర్పులు చెప్పుట కుద్దేశింపబడిన స్థలము. పుట్టినయిల్లు - 'నెలవు' యని యర్థము.

ఆనాటి చాల తెలుగుపదములకు కావ్యత్వము కల్గించి పాండురంగమాహాత్మ్యమువంటి మహాప్రబంధమున నిబద్ధము చేయుటయన్న సామాన్య విషయము కాదు. అట్టి పదముల నెన్నింటి నో ఔచిత్య స్ఫోరకములుగా ప్రయోగించి తెలుగువాతారణము కల్పించినవాడు రామకృష్ణుడు.

నేటికిని ఆపదములలో చాలవరకు జన వ్యవహారమునం దున్నవే. 'గాదె, రచ్చ' యనున విట్టివే

ప్రాసగువిత్తులకు 'రాజనాలు' అని వ్యవహారము. అన్వయము (కులము) ను పోల్చుటకు పాలకడలి యున్నది. మొహము మొత్తి యేమో రామకృష్ణుడు విడిచి వైచెను. 'ప్రాసగువిత్తువంటిది' అనెను. ఇట్టి పోలిక చెప్పుటకు స్వతంత్రప్రయోగముల యెడ ప్రీతి, గుండెదిటవు కల రామకృష్ణునికి చెల్లినది.

సాధారణముగా వంశమును వర్ణించుట యందు తొంబదిపాళ్ళు వర్ణింపబడువారు సూర్యచంద్రాన్వయములకు చెందినవారై యుండుట, అందువలని తదన్వయము ఏ పాలకడలిలోనో ముంచి తేల్చుటలు జరుగును. అది మనమహాకవుల తక్కుడుదనము కాదు. ఆకథ అట్టిది. ఆనాయకు డట్టివాడు. అందు వారు చేసిన వర్ణన సముచితము.

కాని అందుకు విరుద్ధముగా లోకసామాన్యేతివృత్తమయిన ఈ కథయందు లోకముభాషలో చెప్పవలెను. రామకృష్ణుడు అట్లు చెప్పెను 'ప్రాసగు విత్తువంటి నెఱిపాఱుకోలం' బని - ఈ మాట చెప్పుటకు పాండిత్యము చాలదు. ప్రతిభ కావలెను 'లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్' అను విధమున ప్రతిభ యందన్నియు నంతర్భవించును.

నిగమశర్మ అందగాడు వాక్ప్రౌఢి గలవాడు. పైగా వయసుకాడు. సంపన్న గృహస్థుల యింటి బిడ్డ. సమస్త వేదాంత రహస్యములను తెలిసినవాడు. కాని

విశాలాంధ్ర చక్రమును నడుపుకొనవలసినదిగా హితవును బోధించినారు. రాష్ట్రమాత కరుణ కలిగియున్నచో తెలుగు దేశమునకు తిండికి,బట్టకు తక్కువేమియు కలుగదని అభ్యుదయము నూహింపగలిగినారు.

'సంగమింపగ రాదుజలధియందొకచుక్క
దివ్యాంధ్ర మధుర నదీ జలంబు,
జారిపోరాదు సస్య శ్యామలము గాక
దేశాన కడపు బెత్తెడు పొలంబు
తపియింపగూడ దంధః క్షామ హతిఁ జేసి
పని చేయగల కూలి వాని దొక్క
యాచింపరాదు గృహచ్ఛిద్ర దుఃఖాన
మృదులాంధ్ర విమల సాహిత్యలక్ష్మి
రాయ వేశ్యాభుజంగుని రాజ్యమందు
ననుభవించిన భోగ భాగ్యములు మరల
కోరుచున్నారు ప్రజలు నీ గొడుగునీడ
ప్రతిభ గలిగిన నవ్యాంధ్రరాష్ట్రలక్ష్మి!'

అని రాయలనాటి సుఖజీవనమును, శాంతి సౌభాగ్యములను మరల నవ్యాంధ్రరాష్ట్రలక్ష్మి గొడుగునీడన పొందవలయునని కాంక్షించినారు. రాయల యుగము స్వర్ణయుగమనికదా చరిత్ర ప్రసిద్ధి. అట్టి స్వర్ణయుగమునే జాషువగారు కోరుటలో ఎంతేని సామంజస్యము గలదు.'విశ్వశ్రేయః కావ్యమ్' అను సూక్తి ననుసరించి ప్రజల శ్రేయస్సును, అభివృద్ధిని కవిగా జాషువగారు కాంక్షించి తమ ధర్మమును నిర్వర్తించినారు. నరహంతకులను, స్వార్థపిశాచములను ఏ విధముగా శిక్షించి, మానవతను కాపాడి సుఖశాంతి సస్యమును మొలిపించెదవో యనిరాష్ట్రలక్ష్మినికర్తవ్యోన్ముఖురాలినిగా జేసినారు.

పొట్టి శ్రీరాములు ఋషితుల్యుడు. ఆయనకు కృతజ్ఞతలు చూపుట భావ్యమని 'తుమ్మల' వారి హితోపదేశము
'జగమహా! యన శ్రీరామనగర మనెడు
పేరు మనరాచవీటికిఁ బెట్టవలదె ?
ఇంతమాత్ర కృతజ్ఞతయేని దెలుప
రట్టి ! తెల్గువలంతు లాపొట్టిఋషికి?'
—'రాష్ట్రగానము'

ఒక్క ఋషిమాత్రమేకాడు. స్వార్థత్యాగముతో సకలాంధ్ర శ్రేయస్సు కొరకు ఆత్మార్పణము గావించిన మేటి వీరుడు. ఆంధ్రప్రజల హృదయదర్పణములందు చెరిగిపోని శాశ్వత ప్రతిబింబమై నిలిచియున్న చిరంజీవి, జాషువగారు తమ కావ్యములో రాష్ట్రదీక్షామహాయోగియైన పొట్టిరాముని ఆత్మ బలిదానమును స్మరించుచు -

'భక్షించితివి రాష్ట్రదీక్షా మహాయోగి
పొట్టిరాముని రక్తభోజనంబు'
అని రాష్ట్రమాతకు నివేదించుచు -
'నిండు ప్రాణమిచ్చి నిన్ను పుట్టించిన
బ్రహ్మలందు మిన్న రాములన్న'

అని పొట్టి శ్రీరాముని ప్రశంసించినారు.

'పొలయున్నెత్తురు నేఁ బదెన్మిది దినం
బుల్ క్షుత్పిపాసాగ్నిలో
బలిగావించిన పొట్టి రాముల యన
ల్పత్యాగ మమ్మూకుకొం
డలలింగాల గదల్ప, దిగ్విజయ ఘం
టారావముల్ సేయుచున్
జిలుగుంబల్కుల తెల్గురాష్ట్ర మరుదెం
చెన్ నేడు పుట్టింటికిన్.'.

అని తెలుగు రాష్ట్ర మరుదెంచుటకు పొట్టిరాముల అనల్పత్యాగమే కారణమని ఆ సత్యాగ్రహవీరుని తమ కావ్యములో చిరంజీవిని చేసినారు.

'వట్టి మాటలేల, పుట్టినింటికి నీవు,
కదలి వత్తు వన్న క్షణమునుండి
యననుభూత పూర్వ మైన చైతన్యంబు
వెల్లిరిసె తెల్గువీథులందు.'

అని రాష్ట్రసుందరాంగికి స్వాగతమును పలికి తమహర్షమును ప్రకటించినారు. 'రాష్ట్రపూజ' ను సలిపి తమ దేశభక్తిని వెల్లడించిన జాషువగారు అభ్యుదయకావ్యములలో అగ్రగణ్యులు.

దేశభక్తి కవిత్వము ప్రాచీనమున అంతర్గతమును, ధార్మికచ్ఛాయలు గలిగినదియును, కాగా; నవీనమున ప్రత్యేకముగ నొకశాఖగ నేర్పడినదియును, రాజకీయచ్ఛాయలు గలిగినదియును, అయియున్నది. జాషువగారి దేశభక్తి కవిత్వమునందు ధార్మికచ్ఛాయలు, రాజకీయచ్ఛాయలు, రెండును మేళవించుకొనియున్నవి. ఈ మేళవింపు జాషువగారిలో నున్న సంప్రదాయ నవ్యతల సమన్వయధోరణిని చాటుచున్నది.



---

( 1 వ పేజీ తరువాయి )

గానూ, నియమిత పరిధిలో పరిశీలనకు అనువైన పరిధిలో, అందుబాటు లోనికి తెచ్చే సాధనం సాహిత్యం. భాషతో పాటు దృశ్యాలు కూడా ఆధారంగా ఇటువంటి లక్ష్యాన్నే సినిమా, టీ.వీ. కూడా నెరవేర్చవచ్చు. జీవితానుభూతిని భాషా ప్రక్రియలో నిక్షేపిస్తుంది సాహిత్యం. జీవితం ఆభాస కాదు. జీవితానుభూతిని మించిన సత్యం లేదని చెబుతుంది సాహిత్యం. సైన్సుకూ, ఫిలాసఫీకి, ఏ మేధాగతమైన అన్వేషణకూ లొంగని జీవితరహస్యాన్ని (the mystery of life) నిక్షేపించి అందించడమే సాహిత్య లక్ష్యం. *

# రామకృష్ణుని కవిత - వాస్తవికత

— శ్రీ మట్టి వెంకటనరసింహారెడ్డి

సామాన్యముగా క్షేత్ర తీర్థ మహాత్మ్య ప్రతిపాదకమైన కథలన్నియు స్కాంద బ్రహ్మాండ పురాణాంతర్గతములై యుండును. రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్య మను ప్రబంధమును స్కాంద పురాణాంతర్గతమైన కథలసంపుటియే. మూలకథల నెన్నుకొనుటయందు మెలకువ వహించినతీరు రామకృష్ణుని సాన్యతో దర్శనీయమైన ప్రతిభకు తార్కాణం. రామకృష్ణుడు సామాజిక స్వభావ చిత్రణ కనుగుణముగా నిగమశర్మోపాఖ్యానమును రచించె ననుట సాహసము గాదు. తక్కిన కథలుకూడ కేవల భక్తి తత్పరతాభావ ప్రకటన మొనరింపజాలినవే యయ్యు సామాజిక చిత్రణము చేయుటయందుకూడ సామర్థ్యము కలిగియున్నవి. అయ్యును వేటికవే ప్రత్యేకత నాపాదించుకొనినవి. ఈ ఉపాఖ్యానోద్దిష్ట ప్రయోజనముకూడ క్షేత్రమాహాత్మ్య ప్రబోధకమే యయినను లోకసామాన్యేతివృత్తమయిన ఈకథయందు ,ఆచారవ్యవహారాద్యనేక విషయములకు జెందిన వాస్తవిక చిత్రణమునులోకులభాషలో చెప్పిన మహాకవి శబ్దవాచ్యుడు తిక్కన మనీషి తరువాత రామకృష్ణుడు తప్ప లేడు. తెలుగు నుడికారపు సొంపు, తెలుగు పదముల తెల్లదనపు వింగడింపు రామకృష్ణుని గంటమునుండి దుసికిల్లిన దుర్లభ మాణిక్య సంహతి.

పలువురాధునికుల అభిప్రాయమున ప్రాచీన గ్రంథమండలి యందు వాస్తవిక ధోరణిలే దను దురభిప్రాయము గలదు. కాని అది యంత యుక్తిసహమగు మాట కాదు. ఆయాగ్రంథముల యందు వారివారి అవతారికోక్త్యసారముగా ఒకనిర్దిష్ట ప్రయోజనము నుద్దేశించి స్వవచో వ్యాఘాతము లేశములు లేకుండగ గ్రంథగ్రథన మొనర్చిరి. అంతియ కాని (మనమనుకొనినటుల) వాస్తవిక ధోరణికి అద్దము పట్టుదు మనివారు చెప్పికొనలేరు. అయినను ఎడనెడ కథానుసారముగ ఔచిత్యభంగము వాటిల్లని పట్టుల ఏతత్కాలానుగుణమైన సంప్రదాయమును నిక్షిప్తపరిచిరి. అట్టి అవకాశమును సంపూర్ణముగా కలిగియున్నది నిగమశర్మోపాఖ్యానము. ఆనాటి సామాజిక లక్షణమునకు లక్ష్యప్రాయముగ రచించుట రామకృష్ణుని లోకజ్ఞతకు చక్కని నిదర్శనము. అదియే ప్రస్తుత వ్యాస విషయము.

వాస్తవికతను చెప్పుట యనునది (1) సంస్కృత సమాసభూయిష్ఠమై (2) తెలుగుపదములలో తేటయై (3) సంస్కృతాంధ్రపదముల సరసమైన సంగమంతో తెలుగువెలుగును పుట్టించునదై మూడు విధముల మనసాహిత్యమునందు కానవగును. పరిశీలింప రామకృష్ణుడు మూడవ విధమునందు ముచ్చటపడినట్లు అవగతమగుచున్నది. కథాప్రారంభమునవే_

ఉ: 'ప్రాసగు విత్తువంటి నెల
పాటుకొలంబున బుట్టివేదముల్
వోసినగాదె శాస్త్రములు
పుట్టినయిల్లు కళాకలాపముల్
డాసినరచ్చ...........' (3_3)

ప్రాసగువిత్తు - రాజనపువరి విత్తు; గాదె - ఉగ్రాణము, ధాన్యాగారము, 'పాతర(underound godown)' అని బులుసువారు. రచ్చ - సభ; పల్లెటూళ్ళయందు తగవులు పరిష్కరించి తీర్పులు చెప్పుట కుద్దేశింపబడిన స్థలము. పుట్టినయిల్లు - 'నెలవు'యని యర్థము.

ఆనాటి చాల తెలుగుపదములకు కావ్యత్వము కల్గించి పాండురంగమాహాత్మ్యమువంటి మహాప్రబంధమున నిబద్ధము చేయుటయన్న సామాన్య విషయము కాదు. అట్టి పదముల నెన్నింటినో ఔచిత్య స్ఫోరకములుగా ప్రయోగించి తెలుగువాతారణము కల్పించినవాడు రామకృష్ణుడు.

నేటికిని ఆపదములలో చాలవరకు జన వ్యవహారమునందున్నవే. 'గాదె, రచ్చ' యనున విట్టివే.

ప్రాసగువిత్తులకు 'రాజనాలు' అని వ్యవహారము. అన్వయము (కులము) ను పోల్చుటకు పాలకడలి యున్నది. మోహము ముత్తియేమో రామకృష్ణుడు విడిచి పైచెను. 'ప్రాసగువిత్తువంటిది' అనెను. ఇట్టి పోలిక చెప్పుటకు స్వతంత్రప్రయోగములయెడ ప్రీతి, గుండెదిటవు కల రామకృష్ణునికి చెల్లినది.

సాధారణముగా వంశమును వర్ణించుట యందు తొంబదిపాళ్ళు వర్ణింపబడువారు సూర్యచంద్రాన్వయములకు చెందినవారై యుండుట, అందువలని తదన్వయము ఏ పాలకడలిలోనో ముంచి తేల్చుటలు జరుగును. అది మనమహాకవుల తప్పుదుదన మనికాదు. ఆకథ అట్టిది. ఆనాయకు డట్టివాడు. అందు వారు చేసిన వర్ణన సముచితము.

కాని అందుకు విరుద్ధముగా లోకసామాన్యేతివృత్తమయిన ఈ కథయందు లోకముభాషలో చెప్పవలెను. రామకృష్ణుడు అట్లు చెప్పెను. 'ప్రాసగు విత్తువంటి నెలపాటుకొలం' బని _ ఈ మాట చెప్పుటకు పాండిత్యము చాలదు. ప్రతిభ కావలెను. 'లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్' అను విధమున ప్రతిభయం దన్నియు నంతర్భవించును.

నిగమశర్మ అందగాడు వాక్ప్రౌఢి గలవాడు. పైగా వయసుకాడు. సంపన్న గృహస్థుల యింటి బిడ్డ. సమస్త వేదాంత రహస్యములను తెలిసినవాడు. కాని

విలాసపురుషుడు. వాని అలంకరణములు వాని తిరుగుటలు అంతయు నిగమశర్మ వంటి వైదికుల బిడ్డకు సరిపోలనివి. అవి నేటి షోకిల్లాపురుషులకు దీటుగా ఆనాడే రామకృష్ణుడు వర్ణించెను.

'తలగడిగికొనుట, అంగమర్దనము, చక్కనికలమాన్న భోజనము, గంధము నలదికొనుట,పువ్వుల దండలు ధరించుట, కపురంపు వీడ్యము వేయుట, సర్వాలంకారభూషితు డగుట'- అనునంతవరకు బాగుగానే యున్నవి. 'కడగిన ముత్యము వోలె నుండుట' కూడ బాగున్నది. కాని ఈ వేషమంతయు గట్టి పురములో షికార్లు చేయు నట. అది నిగమశర్మను సగము శర్మగా చేసివైచినది. అక్కడ ఉన్నది నిగమశర్మ పోకిరితనము. ఆవిషయమును వ్యక్తము చేయుటకే పద్యము (3-9) చివరగా 'వాలుచుం బురిన్' అని ఒక్క మాటను ప్రయోగించెను. ఆమాటయందే వాడి చెడుతనమంతయు ప్రతీయమాన మగుచున్నది. కాని రామకృష్ణుడు అంతటితో నూరకొనలేదు. దాని తరువాత-

'కలదు లేదను వాదములకోర్చి మీసుమీ
సముపంటి యొంటిజంటెము మెఱవగ'
-(3-1-)

అని ఇంకను చాల వర్ణించెను. ఈ వర్ణనమంతయు ఒక్క నిగమశర్మకే గాదు. ఆనాటి సంఘమునందలి అట్టి వ్యక్తు లందఱకిని ఆపాత్ర ప్రాతినిధ్యము వహించినది. నేటికిని ఇదేమీ పాతగాదు.ఇకముందును అంతే. చెడునడత యనునది మానవ స్వభావమునం దున్నది. సత్కవికి ఎప్పుడును లోకము ప్రమాణము.

శకునములకు సార్వకాలిక మైన మన్నన గలదు.

'భార్యపాలిండ్లు రిక్తకుంభములు, రోయి
వెలది చనుదోయి నిండుకుండలు......'
(3-11)

పాలిండ్లను కుండలతో పోల్చుట సామాన్య విషయము. రిక్తకుంభములు, నిండుకుండలు అనుట ఎందును గానము. రామకృష్ణుడు చెప్పెను. చెప్పుటయందు లోకసామాన్యమైన శకున రూపమైన యొక ఆచారమును పొదిగెను. రామకృష్ణుడు యాదృచ్ఛికముగా గాక ప్రయత్నపూర్వకముగనే దేశీయాచారములను వర్ణించె ననుటకు ఇంతకంటె మంచి ఉదాహరణ ముండబోదు.

రిక్తకుంభములు - శూన్యమైన కుండలు. ఇవి ఎదురు పడిన అశుభసూచకములు. ముఖ్యముగా క్రొత్తకుండ ఎదురు పడిన అమంగళ మని అందురు. అందుకు కారణ మున్నది. మరణాదిక సమయములందు క్రొత్తకుండయం దన్నము వండుకొని శవ మూని నడచువారికి ముందు తీసికొనిపోవుట కలదు. అట్టి దుర్నిమిత్తమునకు ముకతమున నది దుశ్శకునము. చూడ తగనిది. పూర్ణకుంభములు శుభసూచకములు. శుభకార్యార్థమై వెళ్ళునపుడు పూర్ణకుంభ మెదురైన మంగళకర మని చెప్పుదురు. అందువలన అది చూడతగినది.

'పాండురంగవిభుని పదగుంఫనంబు' అని రామకృష్ణుని విశిష్ట కవితాగుణమును తెలుపు ప్రసిద్ధమైన యాభాషణక మొకటి గలదు. పదగుంఫన మనగా పదముల యొక్క కూర్పు. కూర్పు శైలీసంబంధమైనది. ప్రతిమహాకవికిని ఒక శైలి యుండును.

ఈవిషయమునే అవతారికలో 'సరసార్థ బోధ ఘటనాహేలా పరిష్కార శారద నీరూపము' అని విరూరివేదాద్రి మంత్రి తన్ను ప్రస్తుతించినట్లు చెప్పుకొనెను. సరసమైన అర్థబోధ కలుగునట్లుగా పదములను కూర్చుట యనెడి విలాసమే అలంకారముగా గలవాడు. సరసమైన అర్థబోధయన నెట్టిది? రసవంతమైన అర్థమును బోధించునట్టిదా? అట్టిదే. కాని రామకృష్ణుడు మారుమూలపదముల, స్వతంత్ర ప్రయోగములయందు మక్కువ గలవాడు. పదములను ప్రయోగించుటయందు నిపుణత్వమును ప్రదర్శించువాడు. అనగా పరిష్కృత్యసహములైన శబ్దములను ప్రయోగించు ప్రతిభకలవా డని యర్థము ఆప్రయోగించుట యందును రామకృష్ణుడు విలక్షణత ప్రదర్శించెను. కవితను-వాస్తవికతను క్షీరనీరన్యాయమున కలిపిన వాడు. అదియే సరసార్థ ఘటన.

నిగమశర్మ భార్యావిముఖుడు, వేశ్యాభిముఖుడు అని చెప్పవలసియుండుట కథాగతమైన విషయము. దీనిని సామాజిక పరమైన యొక ఆచారముతో-అనగా రిక్తపూర్ణకుంభములతో పోల్చి కవితను వాస్తవికతను మేళవించి చెప్పెను. ఇట్లు మరొకడు చెప్పలేదు. శారదయే రామకృష్ణుని రూపము కదా!

సీ॥ 'దినవెచ్చమునకై తనమేన గలసొమ్ము
...............' (3-16)

అను పద్యమున ఆనాటి సాంఘికవిషయములు చాల చెప్పెను. బచ్చింట-కోమటింట, సొమ్ములు కుదువబెట్టుట ఈదులు-ఈతచెట్లను, గిలుబాడుట - పత్రములు వ్రాయునాచారము,మిండవడ్డి(అధికమైన వడ్డి)కి అప్పులిచ్చెడు సాహులు,ఈనాము భూములు, గుత్తభూములు, గాదినేలలు (underground godowns) అగ్రహారములు-అనునవి.

'సాహువు' - 'సాహుకారు' అనుపదమునకు తద్భవరూపము. వీరు నేటి కాబూలీవాలాల వలె నరరూప రాక్షసులై యుండనోపుదురు. అందుకే కాబోలు రామకృష్ణుడు - 'మృత్యురూపము లైన సాహులచే ఋణగ్రాహి యగుచు'' అని వ్రాసెను. శ్రీనాథుడు రోసిన భయంబై తోచు గడ్డంబుల వ్యాపారులు బహుశః రామకృష్ణుని కాలమునాటికి విజయనగర ప్రాంతముల బాగుగా వ్యాపించియుండి రని చెప్పవచ్చు.

పురుషులుకూడ స్త్రీలవలె నిడుపాటి కుఱులు గలిగియుండిరి. పువ్వులు ముడుచుకొనియుండిరి. కుటుంబమున బంతి భోజనము అలవాటైయుండియుండెను.(3-27)

'ఎలయుసీత్కారములతోడ నీళ్ళు
గ్రుక్కి
యంటునంటుల పరికించి యంట్ల బోడిచి
గోరుముక్కల దిగదువ్వి తూరుపెత్తి
నెఱుల గలిగిన పేల నన్నింటిఁ దిగిచి'
(3-30)

నిగమశర్మ ఒకరోజు ఇంటికి వచ్చెను. అక్కవాని దుర్నయము మాన్యకతమున నాదరించి స్నానభోజనాదికము లైన పిదప తమ్ముని జుట్టుముడి విప్పి ఈళ్ళకు (పేల యొక్క గ్రుడ్డు దశను-'ఈపి'యని వ్యవహారమున కలదు) గ్రుక్కి,-ఛీఛీ! ఎంత అసహ్యముగా తయారైనది.ఇవి ఏమైన పేలా? ఇది ఏమయినా తలయా?' అని ఛీత్కరించిన దట. తలను గోరుమొనల దిగదువ్విన దట.

అల్లే మచ్చునకు మరియొకటి
'చేటి కానీత పీఠి కాసీన యగుచు
పద్మకర్ణిక కొలువున్న పద్మవోలెఁ
గుడికవలననింతయోరగాఁగొమరుమెరసి
బిడ్డచనుద్రావ నిట్లను బిసరుహాక్షి'
(3-32)

తమ్ముని వెంట్రుకలు ముడివైచినది. వాని తెచ్చిన పీటపై నాసీనయైనది. ఆ కూర్చుండిన విధమును బహునిపుణముగా స్వభావసుందరముగా వర్ణించెను.

ఆడువారు కూర్చుండునపుడు సామాన్యముగా చక్కగా కూర్చుండునలవాటుండదు. కొంచెమోరగా - ఒత్తిగిలి కూర్చుందురు. ఆ కూర్చుండుటయం దొక యొయ్యార ముండును. అది ఆడువారి రక్తగ్రస్థమైన గుణము. ఇక్కడ నిగమశర్మ అక్క అట్లు కూర్చున్నది. పైగా బిడ్డకు చనుగుడుపుతూ తమ్మునితో మాటాడిన మాటలును సామాన్య సంసారముపక్షమున నుండు స్త్రీలు మాటాడునట్లే. ఇది వాస్తవికత. సునిశిత పరిశీలన పాటవమునకు నికషోపలముగా దీనిని రచించెను.

'పద్మకర్ణిక కొలువువున్న పద్మవోలె' అని ఉపమాలంకార మొకటి కూడ ఇందు చొప్పించెను. ఇది కవితావిషయక మైనది. తల్లిదండ్రులు గాని, పెద్దలుగాని, పిన్నవారైన, ముత్తైదువలైన, ఆడువారిని దీవెనగా గాని ఆశీఃపూర్వకముగాగాని పలుకునపుడు 'మాతల్లి మహాలక్ష్మి' అని అందురు. రామకృష్ణుడు ఆమాట నేయిందు వాడినాడు. ఈకవిత-వాస్తవికతలసమ్మేళనమున పాత్రస్వభావమును పాఠకునకు పట్టియిచ్చినాడు. ఈ కలయిక నీరక్షీర న్యాయసదృశమని చెప్పితినిగదా!

'ప్రారంభించిన వేదపాఠమునకున్
ప్రత్యూహ మానంచునో
యేరా తమ్ముడ!.........' (3-33)

అక్క నిందా పాత్ర చారిత్రుడైన నిగమశర్మకు బుద్ధిగరపుటకై ఈపద్యమును ప్రారంభించినాడు రామకృష్ణుడు. 'ఏరా తమ్ముడ!' అని వ్యవహారసరళిలోనే. నీరాకకోసం కన్నులు కాయలు గాచిపోయిన వన్నది. నేనేకాదు మీ బావకూడ నీసందర్శనాభిలాషతో ఉండినాడు' అని మొదలుపెట్టి నీతులన్నియు బోధించినది. ఈఘట్టము ఘట్టమంతా ఎంత సామాన్యవిషయమో ఎంత సహజముగా వర్ణించినాడో చెప్పలేము. అన్ని పద్యములను సమీక్షించుట కష్టసాధ్యము కాదు గాని గ్రంథవిస్తర మగును కావున దిఙ్మాత్రముగా నొక్కటి చూపింతును.

'నాదు సహోదరుండు... ... ...
యే నతనియజ్ఞమునంగడుఁ బూజ్య
రాలనై వేదియలంకరింతునని...'

నిగమశర్మ అక్కగారు ఆసపడినది. కాని అది అంతయు బూడిదపోసిన పన్నీరు చందంబున వ్యర్థమైనది. దానికొఱకామె వాపోయినది.

యజ్ఞముచేయునపుడు అడపడుచులు-ముఖ్యముగా అక్కగారుండినయెడల అక్కగారు యజ్ఞవేదిక నలంకరించు ఆచార మొకటియుండె నని తెలియుచున్నది. ఇది వైదికాచారమేయయినను తోడబుట్టులు యజ్ఞవేదిక నలంకరించు దేశీయమైన సంప్రదాయము ఒక[illegible] ఉండెను.

పంటలు ముక్కారు పండెడి[illegible] కాశ్మీరఖండముల నెడి శ్రేష్ఠమైన పరివం[illegible] డము లుండెను. (3-40) ఇట్టివి కొల్లలు[illegible]

ఇంటికివచ్చిన నిగమశర్మ మరల సర్[illegible] ధనముతో అడవిని బడి పారిపోయెను దొంగలు చావుదెబ్బలు కొట్టి దోచుకొ[illegible] పోయిరి. ఒక కాపు రక్షించెను. త[illegible] పుండ్లు గడిగించి బ్రదికించెను. ఆ యింటి[illegible] యందున్న కాపుకోడలును, బ్రాహ్మ[illegible] బ్రువుడైన నిగమశర్మయు లేచిపోవలయు[illegible] నని నిశ్చయించిరి.

పశువులకు గాలిసోకిన దని గ్రామాధి[illegible] కారి జాతర చాటించెను. జాతర గాలి[illegible] గంగల నిమిత్త మట. అనగా దేవతల[illegible] ఉపశాంతి కొఱకని యర్థము.

ఆ జాతరసందర్భమున జనుల అలంకరణము లిట్లు వర్ణింపబడినవి.

పసుపునీట జలకమాడిరి.తలకు గొర్వెచ్చని చము రంటుకొనిరి. చిన్నిగళ్ళ క్రొత్తబట్టలను ధరించిరి. చిట్టిబొట్టునిట్టునట్టు ధరించిరి - (3-74). ఇట 'చిట్టిబొట్టు' అన నేమియో వివరింతును. 'చిట్టిబొట్టు=చిన్నమంగళసూత్రపుసొమ్ము' అని బులుసువా రిచ్చిన అర్థము. 'చిట్టిపొట్టి' అనుపాఠాంతరమును గ్రహించి 'చిన్నచిన్న సొమ్ములు' అని తెన్మఠంవారి వ్యాఖ్యానం. కాని ఇవిరెండును సరికావు. చిన్న మంగళసూత్రపు సొమ్ము' అను బులుసువారి అర్థమునకు అర్థమేమి? చిన్న మంగళసూత్రపు సొమ్ము పెద్ద మంగళసూత్రపుసొమ్ము అని రెండుండునా? అదియును కేవల పర్వదిన సందర్భము అందు ధరింతురా? ఇది యెంతయు హాస్యాస్పదము. ఇక తెన్మఠంవారి అర్థము చూతము. వారి పాఠాంతరము'చిట్టిపొట్టి' అనునది 'చిట్టిపొట్టి=చిన్నచిన్నవి' అని

(తరువాయి 8 వ పేజీలో)

# దక్షారామము

— శ్రీ శనగన నరసింహాసా

దక్షారామమునందు భీమపతిగా
దర్పించి శ్రీ కాళహ
స్తి క్షేత్రంబున ఈశ్వరాహ్వయుఁడుగా
దీపించి శ్రీశైలది
వ్య క్షేత్రంబున మల్లికార్జునుఁడుగా
భాసించి ముప్పొద్దు సం
రక్షించున్ భవుఁడీ త్రిలింగధరణీ
రాజ్యం బజయ్యంబుగన్.

జన్మమెత్తిన దానికిఁ సార్థకముగఁ
జూడవలెనమ్మ! సౌభాగ్యసురపదంబు
నాంధ్రసామ్రాజ్యలక్ష్మికి గలైక వజ్ర
మండనంబును శ్రీ భీమమండలమును.

నలుమొగంబుల వాదించు నలిననూతి
నొక్క మొగమున వాదించి యుక్కడంచు
పండితాఖండలులు భీమమండలమునఁ
బెక్కురున్నారు వారికి మ్రొక్కిచనుము!

పప్పు పు (బు) లుసు లేక ప్రారంభమే కాదు
శుభలయంబునందు సవన కర్మ
పరువు దక్కఁబోదు వారిహారాదులకైనఁ
జవు లెఱింగి ఫల మొసంగకున్న.

ఢిల్లీశ్వరునో జగతీ
వల్లభునో తక్క పెరల వర్ణింపంగా
నొల్లని పండితరాయల
పల్లియ ముంగండ నీకు ప్రమదం బొసఁగున్!

అల్ల షహాజహాను వసు
ధాధిపమౌళికి ముద్దుటల్లుఁడై
యిల్లతికంబువోయి యవ
నేశుని క్రమ్మఱ నల్లువానిగాఁ
జెల్లఁగఁ జేసికొన్న కవి
సింహుని బండితరాయలన్ కృపా
పల్లవితోత్తరంగ సుర
వాహిని తానెఱుంగున్ సహోదరీ!

సప్తగోదావరాంబు నిర్ఝరతరంగ
మాలికాశీకరోన్మిశ్రమధుర శిశిర
గంధవహములు నెమ్మేను గౌఁగిలించి
తీర్చు నౌదవ్వులందె పథిశ్రమంబు.

దక్షిణవార్ధితీరమున
దర్పము సూపెడి భీమమండలిన్
వీక్షణ సేయు వేళఁగను
విందుగ ముందర గోచరించు నీ
కక్షయభోగభాగ్యముల
కాస్పదమై నుతికిన్ సమర్హమా
దక్షపురీ విభూషణము
దక్షిణకాశిపురంబు పక్షిణీ!

గుంపులు గుంపులౌచు శత
కోటి ధరాదికులైన నిర్జరుల్
కొంపలు వీడి వత్తురఁట
కొమ్ములతో తిరునాళ్ళ మాణి కా
చంపకగంధివల్లభుని
సౌరుకనుంగొన దక్షవాటి కా
సొంపులు గాంచు భాగ్య
మదిసోదరి! నిన్ను వరించుఁ గావుతన్!

పంచమవేదమున్ బలుకు
బ్రహ్మమునీంద్రుడు వేదముల్ విభా
గించిన నూత్నధాత పదు
నెన్మిదియైన పురాణముల్ విని
ర్మించిన దిట్ట దక్షపురి
మెట్టిన తొల్లిటిగాథ లెంచి రో
మాంచము లూను మేన మహి
తాంధ్రధరాతల మెల్ల నేఁటికిన్.

పంచముఖుం డొకానొక నెపంబున
వ్యాసుని కాశినుండి గెం
టించిన నాడు స్వాగతి ఘ
టించి దయామతి నాశ్రయంబు క
ల్పించిన వేల్పు దక్షపురి
భీమయనాథు డె సుమ్ము తత్పురీ
ప్రాంచల భూమి నేఁడుఁ గన
వచ్చు మునీంద్రుని పాదచిహ్నముల్.

పారాశరి కెట్లటు ద
క్షారామము నీకు సమ్మదావహ మగుచున్
వారణసీ విరహవ్యథ
దూరం బొనరింపఁగలదు ధూర్జటి కరుణన్.

తనువుల్ దాల్చిన యాదిదంపతుల చం
 దంబొప్ప వారాణసీ
వినివాసంబును బాసి దక్షపురిలో
 వేగించినా రాత్మజే
వనముల్ కుంభభవుండు సాధ్వియగులో
 పాముద్రయున్ మున్ను ప
క్షిణి! విన్నావె పరోపకారపరతా
 స్నిగ్ధంబు లావృత్తముల్.

 వింధ్య గర్వ మడిపి విశ్వంబు రక్షింప
 దక్షిణాపథంబు తరలివచ్చె
 కుంభజన్ము డాత్మకుల పాలికం గూడి
 ఋషుల యెడదలోతు లెఱుగదరమె!

ఎక్కడి యుత్తరాపథ మ
 హీనసుఖాస్పదమైన కాశి తా
నెక్కడ వైంధ్య జృంభణము
 లెక్కడ దుర్గమదక్షిణాపథం
బెక్కడ పుష్పబోణిగాని
 యేగుటయెక్కడ! అక్కటా! యెదల్

 క్రక్కదలించు సాహసిక
 కార్యము లయ్యవి వారికే తగున్.
జలధుల్ సర్వము పుక్కిలించె నహుషున్
 సర్పంబుగా నెట్టె ని
ల్వలవాతాపుల దైత్యకృత్య ముడిపెన్
 వైంధ్యాచలాటోపమి
య్యిలకున్ దింపె నభంబునుండి; తరమే
 యెవ్వారు వాక్రువ్వగా
కలశీసూను మహాత్త్వముల్ త్రిజగతీ
 ల్యాణ ఘంటాధ్వముల్.
 దక్షారామ విభూతికిన్ మెఱుగుట
 ద్దంబైన కాశ్యేంద్రమున్
 దక్షారామము నింద్రగంటి హనుమత్
 శాస్త్రీందు డాంధ్రభక్షమా
 ద్రాక్షారామముగా రచించె కవితా
 దక్షుండు సద్గోష్ఠులం
 దక్షయ్యంబుగ గ్రోలవచ్చును తదీ
 య స్వచ్ఛమాధుర్యముల్.
('పాంథగీత' కావ్యమునుండి)

---

( 6 వ పేజీ తరువాయి )

మాత్రమే అర్థము. 'సొమ్ములు' అధ్యాహారముగా తెచ్చికొనిరేమో!

'చిట్టిబొట్టు' అనగా దృష్టిదోషము తగులకుండునట్లుగా బుగ్గమీద పెట్టెడు బొట్టు. క్రమముగా నేటి కది అందము కొఱకు పెట్టుకొను బొట్టు (Beauty spot) గా మారినది.

ఇంకను పామరజనుల సంప్రదాయములు, జాతరయందు వారు నిర్వహించిన విధమును తెలిపినాడు.

ఒక అతివ సిడిమ్రాను ప్రేలాడినది. ఒకతె నిప్పులలో నడిచినది. వేరొకతె పందిరిగుండము ప్రవేశించినది. మరొకతె అరటాకు నర్తించినది. ఒకయింతి వీపున కండలుగోసి యిచ్చినది. ఒక యువిద మాఱుగా లిచ్చినది. ఒకపొలతి నోరి తాళంబు లిచ్చినది - (3-77)

సిడి యననేమో సురవరం ప్రతాప రెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్రలో పటము సహాయమున చక్కగా వివరించిరి. అరటాకుపై నర్తించుట. ఇదేమిగొప్ప విషయము? అను అనుమానము రావచ్చును. అరటాకు వైశాల్యము ఎంత ఉన్నా వాట్యముచేయుటకు వలనుగానిది. నేర్పు అవసరము. అదీ అందులోని అర్థము.

ఈ వర్ణన అంతా స్థూల దృష్టికి అనవసరము. అనౌచిత్యము అనిపించకమానదు. కాని అట్లుగాక అది యిందు చాలా అవసరము. ఇంత పరవశత్వమున జన మూగిపోగినగాని కాపు కోడలును తీసుకొని పోవుట సాధ్యముగాదు. అయినను వారి అన్వేషణనుండి తప్పించుకొనుట అంత కంటెను వీలుపడని మాట. కనుక కవి ఆవర్ణన చేయుట అవశ్య మయ్యెను.

ఇంకను ఈదృష్టిని చూడవలసిన పద్యములు చాల ఉన్నవి. ఎన్నని వ్రాయను. అవకాశము కలిగినప్పుడు చర్చింతును. ఈవ్యాసోద్దేశ మేమన రామకృష్ణుని కవితను వాస్తవికదృక్పథముతో గూడ చదువవలసినఅవసర మెంతేని గలదని చెప్పుటయే.

# అక్షరకాంతి భావము

– శ్రీ "కవిగణపతి"

మిహిర దృగ్జాతముగ వెడలి గ
మించు తేజము వెలుఁగుచున్నది.
బయలు నేలల నడుమ కల్గిన
వస్తువుల వెలిగించుచున్నది.
వస్తువులఁ గనఁజాలు కన్నుల
పాపలను వెలిగించుచున్నది.
కనులుమూసిన విప్పినను త
త్కాంతిపుంజము వెలుగుచున్నది.

గుండెలో వరిమల్లు కోలత గ
గుప్త తేజము వెలుఁగుచున్నది.
కన్నులకు మేధకును నందని
క్రమ తేజము వెలుఁగుచున్నది.
మొదలు తుద లూహింపఁ జిక్కని
మొదటి వెలుఁగది వెలుఁగుచున్నది.
కాలరూపంబగుచు జగములఁ
గడపు తేజము వెలుఁగుచున్నది.

సప్తవర్ణ ప్రచుర భాస్వ
ద్భాను తేజము వెఁలుగుచున్నది.
అన్ని కళలకు నాదికారణ
మైన తేజము వెలుఁగు చున్నది.
బుద్ధిక గపడ జ్ఞానమునఁబడు
సిద్ధ తేజము వెలుఁగు మన్నది.
ధర్మసాక్షిగ వెలసినట్టి య
ఖండ తేజము వెలుఁగుచున్నది.

తత్త్వమై పరతత్త్వమై కల
నిత్య తేజము వెలుఁగుచున్నది.
సత్యశివ సుందరప్రకా
శ మగత్య మెల్లెడ వెలుఁగుచున్నది.
చర్చి, మస్జిదు, మందిరముల ప్ర
శాంత తేజము వెలుఁగుచున్నది.
ప్రాణచైతన్య ప్రభావపు
ప్రణవ తేజము వెలుఁగు చున్నది.

రాగమును మునుబంచి యవతా
రమ్ముగొను ప్రభ వెలుఁగుచున్నది.

(తరువాయి ప్రక్క పేజీలో)

# నిస్వార్థ కళాతపస్వి

'విద్వత్కవి' శ్రీ గుత్తెపల్లి సత్యనారాయణరాజు

ఒక ప్రజ్ఞాపరిపాక భావరుచితో
నోజోగుణస్ఫూర్తితో,
సకలాస్వాద్య రసాత్త కావ్యరచనా
సంభారసారంబు గ
న్న కవిస్వామివి రామచంద్ర! 'ననుస
న్మానించు టే' మందు? నీ
వొక నిస్వార్థకళాతపస్వి వని నే
నూహించి కేల్మోడ్చితిన్.

కవియెవ్వాడని నీవొకానొకట వ్యా
ఖ్యానింపగా విందు మా
నవమాత్రుండగు వాఁడహం కృతికి సు
న్నంజుట్టి, లోకప్రియ
వ్యవహారంబులఁ దట్టి,
నాతిపద విన్యాసంబునన్ జిత్తముల్
దవులం బల్కెడివాఁ డటంచును యథా
ర్థంబిద్ది విద్వత్కవీ!

ఎవఁడొక్కండిల గుర్తుగాఁగొనఁడు సా
హిత్యప్రపంచమ్ము స
త్కవితాసుందరి నీది, నాది, యిటుల
జ్ఞాతంబునన్ మ్రగ్గుచు
న్న విశేషప్రతిభావిదగ్ధులది ని
న్నన్ మొన్న కన్విప్పువాఁ
డవు నొక్కప్పు డపూర్వ కావ్యరచనా
వ్యాసంగ నిష్ణాతుఁడున్.

కని చేయూతనొసంగువాఁడగు జగ
త్కల్యాణసంధాయి పె
ద్దనలన్ దప్ప మఱెవ్వరిన్ గనని మి
థ్యాసాహితీ పోషణల్
పనికిన్ మాలినవన్న నీదుసమతా
భావమ్మహో! చూడగా
ననిదఁపూర్వము రామచంద్రకవిరా
యా! కావ్య వారాన్నిధీ!

మత్తేభంబుల నిట్లు నీకిడితి స
న్మానంబుతోఁ దుల్యమా
విత్తం బియ్యది యానె? తీయని సుహృ
ద్వృత్తంబు రూపించె నీ

(తరువాయి ప్రక్క పేజీలో

# "శరత్ జీవితం - సాహిత్యం"

శ్రీ ఎస్వీ, బి. యస్ సి.

ప్రపంచానికి చల్లని వెలుతుర్లని ప్రసాదిస్తాడు చంద్రుడు. సాహిత్యం ద్వారా హృదయాలకి ఆరాధనల వెన్నెలని పంచిపెట్టాడు శరచ్చంద్రుడు.

భారత సాహిత్యాకాశంలో ప్రచండ తేజాన్ని ప్రభవించిన సూర్యుడు రవీంద్రుడయితే, పవిత్ర ప్రేమామృతాన్ని చిలికించిన చంద్రుడు శరచ్చంద్రుడు.

శరత్ బెంగాలీ వాడంటారు - అతడు పుట్టి, పెరిగిన ప్రాంతాన్ని బట్టి కొందరు. శరత్ సమస్త భారతీయవాదీ ... ఇంకా ముందుకు ఆలోచిస్తే విశాల ప్రపంచవాదీ అంటాను అతను సృష్టించిన పాత్రల్ని బట్టి.

అయినా ప్రాంతీయ వాదమూ, సరిహద్దులూ, ఎల్లలూ సామాన్యులకే కానీ - తన అక్షరాల ద్వారా మానవ జాతిలో సుస్థిర స్థానం సంపాదించుకున్న మేధావుల కెక్కడివి?

చిత్రమేమంటే శరత్ పుస్తకాన్ని పఠిస్తుంటే బెంగాలీ వాతావరణం స్ఫురణకి రాదు (పేర్లు తప్ప) తెలుగుదేశంలోని పల్లెటూరి జీవన విధానమూ, తెలుగు సంస్కృతీ, తెనుగుదనమే కళ్లముందు చిత్రిత మౌతుంది. బహుశా ఏ భాష వాడైనా ఏ ప్రాంతం వాడైనా శరత్ పుస్తకాల్లో తన జీవన విధానాన్నీ తన సంస్కృతినీ శీలవుతా డనుకుంటాను. దాని క్కారణం శరత్ సృష్టించిన సన్నివేశాలు - తీసుకున్న కథాంశాలు - మాట్లాడించిన సంభాషణలు-అట్లాంటివి.

'శరత్' తను చూసిన వ్యక్తుల్నే నవల్లోని పాత్రలుగా మలిచాడు. ఆపాత్రల్ని చదువుతూ మనం ఎదుటి వ్యక్తిలోని ఔన్నత్యాన్ని గుర్తించగలం. అందుకే అవి సజీవపాత్రలు. రచయితలెందరో రచనల్ని చేస్తుంటారు. ఎన్నో పాత్రల్ని సృష్టిస్తారు. కానీ వాటిలో చరిత్ర విస్మరించనిపాత్ర లెన్ని మిగులుతాయ్? చాలా స్వల్పం. వాల్మీకి సృష్టించిన శ్రీరాముడు - వ్యాసుడు ప్రాణం పోసిన కృష్ణార్జునులు - కాళిదాసు కల్పన చేసిన శకుంతల - సజీవపాత్రలే. చరిత్రలో సుస్థిర స్థానాన్ని సంపాదించాయ్ గనక. అలాగే శరత్ సృష్టించిన 'దేవదాస్' కూడా ఒక సజీవపాత్ర. తాగిన ప్రతి ఒకణ్ణీ 'దేవదాస్' అని వ్యవహరించడం-దేవదాసు కథ తెలిసినా, తెలియకపోయినా పరిపాటయిపోయింది.

అందుకే 'శరత్'-సాహిత్య శిల్ప రహస్యాన్నెరిగిన రసశిల్పి. ఉత్తమ కళాఖండాలను నిర్మించిన కళాస్రష్ట. భారతీయుల మనస్తత్వాలను అధ్యయనం చేసి-కథల్లో ప్రతిఫలింప జేసిన మానసిక వేత్త. ఒక నిజమైన రచయిత. జీవితం యొక్క చరమదశలో కేవలం రచనల మీద ఆధారపడి బ్రతుకును నెట్టుకుపోయిన ప్రథమ భారత వృత్తిరచయిత.

శరత్ జీవితం-వ్యక్తిత్వం:- కొందరు రచయితలుంటారు. హాయిగా సుఖంలో పుట్టి, సుఖాల్లో పెరుగుతూ, విశాలమైన న్యూవేవ్ బిల్డింగ్స్లో జీవిస్తూ, కార్లలో షికార్లు కొడుతూ పేదవాడి ప్రణయం గురించీ, పేదవాడి ప్రళయంగురించీ కథలు రాసుకుంటూ కాలం వెలిబుచ్చే వాళ్లని చాలామందిని చూస్తుంటాం. కానీ శరత్ జీవితం సాంతం ఒక ట్రాజెడీ-అదో విషాద గాథ. అదో విహార గాథ. జీవన రహస్యాన్ని తెలుసుకోడానికి జరిగిన అన్వేషణ, విభిన్న మనస్తత్వాల మధ్య మెలిగిన ఆక్రందన-అదో ఆవేదన-అదో ఆవేశం - వేయేల అతని జీవితమే ఒక ఉద్గ్రంథం. అతని వ్యక్తిత్వమే ఒక హిమాలయోత్తుంగ శృంగం. అదో పారే జలపాతం. చెలరేగిన జన సందోహం. అతని అనుభవాలే అశేష భారత, అంతర్జాతీయ ప్రజానీకాన్ని చదివింపజేసిన కరుణామయమైన సాహితీ శకలాలు. అతని కలం గుండెని చించుకొని ప్రపంచానికందిన భావోద్వేగపు సంకేతం. అతని భాష జనం హృదయాల్లోంచి పెల్లుబికే సాధారణ భాష - శరత్ పాత్రలు... సమాజంలో మనచుట్టూ తిరుగాడే బాధా సర్పదష్టాలు. శరత్ కల్పనలు కళ్లు తెరిస్తే కనబడే సాంఘిక చిత్ర

---

( 9 వ పేజీ తరువాయి )

ఎందుగనిన హిరణ్య వర్ణుని
సుందరద్యుతి వెలుఁగుచున్నది.

త్రయీతనువగు జగచ్చక్షువు
రమ్య తేజము వెలుఁగుచున్నది.

కవిగణాధిపుకవిత నశ్వర
కాంతిభావము వెలుఁగు చున్నది.

చిత్తం; బెత్తునకెత్తు స్నేహధనరా
శిన్ గూర్పగా లేక నీ
కిత్తున్ వాదు కృతజ్ఞ తాంజలు కొమ్మా!
ప్రాభక వ్యగ్రణీ!

ఇవి కవిగణపతిపై చెప్పిన పద్యములు. కవిగణపతి గారు ప్రతియేట ఇద్దరు కవులను 116 రు॥ లతో సన్మానించుచున్నారు. అట్లే ఒక సాహిత్య సంస్థనుకూడ 116 లతో సన్మానించుచున్నారు.

# అక్షరకాంతి భావము

- శ్రీ "కవిగణపతి"

మిహిర దృగ్జాతముగ వెడలి గ
మించు తేజము వెలుఁగుచున్నది.
బయలు నేలల నడుమ కల్గిన
వస్తువుల వెలిగించుచున్నది.
వస్తువులఁ గనఁజాలు కన్నుల
పాపలను వెలిగించుచున్నది.
కనులుమూసిన విప్పినను త
త్కాంతిపుంజము వెలుగుచున్నది.

గుండెలో వరిమల్లు కొలతగ
గుప్త తేజము వెలుఁగుచున్నది.
కన్నులకు మేధకును నందని
క్రమ తేజము వెలుఁగుచున్నది.
మొదలు తుద లూహింపఁ జిక్కని
మొదటి వెలుఁగది వెలుఁగుచున్నది.
కాలరూపంబగుచు జగములఁ
గడపు తేజము వెలుఁగుచున్నది.

సప్తవర్ణ ప్రచుర భాస్వ
ద్భాను తేజము వెఁలుగుచున్నది.
అన్నికళలకు నాదికారణ
మైన తేజము వెలుఁగు చున్నది.
బుద్ధికగపడ జ్ఞానమునఁబడు
నిద్ధ తేజము వెలుఁగు చున్నది.
కర్మసాక్షిగ వెలసినట్టి య
ఖండ తేజము వెలుఁగుచున్నది.

తత్త్వమై పరతత్త్వమై కల
నిత్య తేజము వెలుఁగుచున్నది.
సత్యశివ సుందరప్రకా
శ మగత్య మెల్లెడ వెలుఁగుచున్నది.
చర్చి, మస్జిదు, మందిరముల ప్ర
శాంత తేజము వెలుఁగుచున్నది.
ప్రాణచైతన్య ప్రభావపు
ప్రణవ తేజము వెలుఁగు చున్నది.

రాగమును మునుబంచి యవతా
రమ్ముగొనుప్రభ వెలుఁగుచున్నది.

(తరువాయి ప్రక్క పేజీలో)

# నిస్స్వార్థ కళాతపస్వి

'విద్వత్కవి' శ్రీ గత్రైపల్లి సత్యనారాయణరాజ

ఒక ప్రజ్ఞాపరిపాక భావరుచితో
నోజోగుణస్ఫూర్తితో,
సకలాస్వాద్య రసాత్త కావ్యరచనా
సంభారసారంబు గ
న్న కవిస్వామివి రామచంద్ర! 'ననుస
న్మానించు టే' మందు? నీ
వొక నిస్స్వార్థకళాతపస్వి వని నే
నూహించి కేల్మోడ్చితిన్.

కవియెవ్వాడని నీవొకానొకట వ్యా
ఖ్యానింపగా విందు మా
నవమాత్రుండగు వాఁడహం కృతికి సు
న్నంజుట్టి, లోకప్రియ
వ్యవహారంబులఁ దట్టి,
నాతిపద విన్యాసంబునన్ జిత్తముల్
దవులం బల్కెడివాఁ డటంచువు యథా
ర్థంబిద్ది విద్వత్కవీ!

ఎవఁడొక్కండిల గుత్తగాఁగొనఁడు సా
హిత్యప్రపంచమ్ము స
త్కవితాసుందరి నీది, నాది, యిటుల
జ్ఞాతంబునన్ మ్రగ్గుచు
న్న విశేషప్రతిభావిదగ్ధులది ని
న్నన్ మొన్న కన్విప్పువాఁ
డవు నొక్కప్పు డపూర్వ కావ్యరచనా
వ్యాసంగ నిష్ణాతుఁడున్.

కని చేయూతనొసంగువాఁడగు జగ
త్కల్యాణసంధాయి పె
ద్దనలన్ దప్ప మఱెవ్వరిన్ గనని మి
థ్యాసాహితీ పోషణల్
పనికిన్ మాలినవన్న నీదుసమతా
భావమ్మహో! చూడగా
ననిదంపూర్వము రామచంద్రకవిరా
యా! కావ్య వారాన్నిధీ!

మత్తేభంబుల నిట్లు నీకిడితి స
న్మానంబుతోఁ దుల్యమా
విత్తం బియ్యది యానెఁ? తీయని సుహృ
ద్వృత్తంబు రూపించె నీ

(తరువాయి ప్రక్క పేజీలో

# "శరత్ జీవితం - సాహిత్యం"

శ్రీ ఎస్వీ, బి. యస్ సి.

ప్రపంచానికి చల్లని వెలుతుర్లని ప్రసాదిస్తాడు చంద్రుడు. సాహిత్యం ద్వారా హృదయాలకి ఆరాధనల వెన్నెలని పంచి పెట్టాడు శరచ్చంద్రుడు.

భారత సాహిత్యాకాశంలో ప్రచండ తేజాన్ని ప్రభవించిన సూర్యుడు రవీంద్రుడయితే, పవిత్ర ప్రేమామృతాన్ని చిలికించిన చంద్రుడు శరచ్చంద్రుడు.

శరత్ బెంగాలీ వాడంటారు - అతడు పుట్టి, పెరిగిన ప్రాంతాన్ని బట్టి కొందరు. శరత్ సమస్త భారతీయవాదీ ... ఇంకా ముందుకు ఆలోచిస్తే విశాల ప్రపంచ వాదీ అంటాను అతను సృష్టించిన పాత్రల్ని బట్టి.

అయినా ప్రాంతీయ వాదమూ, సరిహద్దులూ, ఎల్లలూ సామాన్యులకే కానీ - తన అక్షరాల ద్వారా మానవ జాతిలో సుస్థిర స్థానం సంపాదించుకున్న మేధావుల కెక్కడివి?

చిత్రమేమంటే శరత్ పుస్తకాన్ని పఠిస్తుంటే బెంగాలీ వాతావరణం స్పృహకి రాదు (పేర్లు తప్ప) తెలుగుదేశంలోని పల్లెటూరి జీవన విధానమూ, తెలుగు సంస్కృతీ, తెనుగుదనమే కళ్ళముందు చిత్రితమౌతుంది. బహుశా ఏ భాష వాడైనా ఏ ప్రాంతం వాడైనా శరత్ పుస్తకాల్లో తన జీవన విధానాన్నీ తన సంస్కృతినీ ఫీలవుతా డనుకుంటాను. దాని క్కారణం శరత్ సృష్టించిన సన్నివేశాలు - తీసుకున్న కథాంశాలు - మాట్లాడించిన సంభాషణలు_అట్లాంటివి.

'శరత్' తను చూసిన వ్యక్తుల్నే నవల్లోని పాత్రలుగా మలిచాడు. ఆపాత్రల్ని చదువుతూ మనం ఎదుటి వ్యక్తిలోని ఔన్నత్యాన్ని గుర్తించగలం. అందుకే అవి సజీవపాత్రలు. రచయితలెందరో రచనల్ని చేస్తుంటారు. ఎన్నో పాత్రల్ని సృష్టిస్తారు. కానీ వాటిలో చరిత్ర విస్మరించనిపాత్ర లెన్ని మిగులుతాయ్? చాలా స్వల్పం. వాల్మీకి సృష్టించిన శ్రీరాముడు - వ్యాసుడు ప్రాణం పోసిన కృష్ణార్జునులు - కాళిదాసు కల్పన చేసిన శకుంతల - సజీవపాత్రలే. చరిత్రలో సుస్థిర స్థానాన్ని సంపాదించాయ్ గనక. అలాగే శరత్ సృష్టించిన 'దేవదాస్' కూడా ఒక సజీవపాత్ర. తాగిన ప్రతి ఒకణ్ణీ 'దేవదాస్' అని వ్యవహరించడం_ దేవదాసు కథ తెలిసినా, తెలియక పోయినా పరిపాటయిపోయింది.

అందుకే 'శరత్'_సాహిత్య శిల్ప రహస్యాన్నెరిగిన రసశిల్పి. ఉత్తమ కళాఖండాలను నిర్మించిన కళాస్రష్ట. భారతీయుల మనస్తత్వాలను అధ్యయనం చేసి_ కథల్లో ప్రతిఫలింప జేసిన మానసిక వేత్త. ఒక నిజమైన రచయిత. జీవితం యొక్క చరమదశలో కేవలం రచనల మీద ఆధారపడి బ్రతుకును నెట్టుకుపోయిన ప్రథమ భారత వృత్తిరచయిత.

శరత్ జీవితం_వ్యక్తిత్వం:_ కొందరు రచయితలుంటారు. హాయిగా సుఖంలో పుట్టి, సుఖాల్లో పెరుగుతూ, విశాలమైన న్యూవేవ్ బిల్డింగ్స్‌లో జీవిస్తూ, కార్లలో షికార్లు కొడుతూ పేదవాడి ప్రణయం గురించీ, పేదవాడి ప్రళయంగురించీ కథలు రాసుకుంటూ కాలం వెలిబుచ్చే వాళ్లని చాలామందిని చూస్తుంటాం. కానీ శరత్ జీవితం సాంతం ఒక ట్రాజెడీ_ అదో విషాదగాథ. అదో విహార గాథ. జీవన రహస్యాన్ని తెలుసుకోడానికి జరిగిన అన్వేషణ, విభిన్న మనస్తత్వాల మధ్య మెలిగిన ఆక్రందన_అదో ఆవేదన_ అదో ఆవేశం - వేయేల అతని జీవితమే ఒక ఉద్గ్రంథం. అతని వ్యక్తిత్వమే ఒక హిమాలయోత్తుంగ శృంగం. అదో పారే జలపాతం. చెలరేగిన జన సందోహం. అతని అనుభవాలే అశేష భారత, అంతర్జాతీయ ప్రజానీకాన్ని చదివింపజేసిన కరుణామయమైన సాహితీ శకలాలు. అతని కలం గుండెని చించుకొని ప్రపంచానికందిన భావోద్వేగపు సంకేతం. అతని భాష జనం హృదయాల్లోంచి పెల్లుబికే సాధారణ భాష - శరత్ పాత్రలు... సమాజంలో మనచుట్టూ తిరుగాడే బాధా సర్పదష్టాలు. శరత్ కల్పనలు కళ్లు తెరిస్తే కనబడే సాంఘిక చిత్ర

( 9 వ పేజీ తరువాయి )

ఎందుగనిన హిరణ్య వర్ణుని
సుందరద్యుతి వెలుఁగుచున్నది.

త్రయీతనువగు జగచ్చక్షువు
రమ్య తేజము వెలుఁగుచున్నది.

కవిగణాధిపుకవిత నక్షర
కాంతిభావము వెలుఁగు చున్నది.

చిత్తం; బెత్తునకెత్తు స్నేహధనరా
శిన్ గూర్పగాలేక నీ
కిత్తున్ నాదు కృతజ్ఞతాంజలు లొమ్మా!
ప్రోఢక వ్యగ్రణీ!

ఇవి కవిగణపతిపై చెప్పిన పద్యములు. కవిగణపతిగారు ప్రతియేట ఇద్దరు కవులను 116 రూ॥ లతో సన్మానించుచున్నారు. అట్లే ఒక సాహిత్య సంస్థనుకూడ 116 లతో సన్మానించుచున్నారు.

ణాలు_శరత్ మిగిలిపోయిం దీనాయితాల్లో కథల్లోకాదు, అక్షరాలు తెలిసిన భారతీయ హృదయాల్లో, పతితుల ఆక్రంద నల్లో.

శరత్ పుట్టింది ఒక పేద మధ్య తరగతి కుటుంబంలోనే. 15 వ సెప్టెంబర్ 1876 న హుగ్లీజిల్లాలోని దేవానందపురం అనే ఒక చిన్న గ్రామంలో పుట్టి, భాగల్పూర్ లో ఊహ తెలిసి, కొన్నాళ్ళు బాల్యాన్ని అక్కడ గడిపింతర్వాత కొన్ని కారణాంతరాల వల్ల ఇల్లు విడిచి దేశాంతరగతు డైనాడు. సన్యాసి వేష ధారణతో దేశాటనము కావించి సామాన్య ప్రజాజీవనాన్ని కళ్లారా వీక్షించగలిగాడు. ఆ తరువాత 1903లో తన 27 వ ఏట తల్లిదండ్రుల మరణానంతరం పట్టెడన్నం కోసం పొట్టచేతితో పట్టుకుని పుట్టినదేశాన్ని విడిచి బర్మాయాత్ర ప్రారంభించాడు. ఇలా రంగూన్ లో ఒక్క బెంగాలీలేన్నే కాదు, వలస భారతీయుల్నందర్నీ పరిశీలించి, సమస్త భారత ప్రాంతాల సంస్కృతినీ, మనస్తత్వాలనూ, జీవన విధానాలనూ అధ్యయనం చేసి అవగాహన చేసుకోగలిగాడు. పధ్నాల్గు సంవత్సరాల పరదేశ జీవనం గడిపిన తర్వాత మళ్ళీ కలకత్తాకి తిరిగొచ్చాడు. ఆ తరువాతే ప్రసిద్ధమైన తన కల్పనా చిత్రాలని ప్రపంచానికందించిన ఒక గొప్ప రచయితగా పేరుగాంచాడు. కాలమనే త్రాసులో ఒక పళ్ళెంలో శరత్ సాహిత్యాన్నంతనూ నిలిపితే_మరో పళ్ళెంలో నిలవగల ఉన్నతమైన వ్యక్తిత్వం, కరుణాత్మకమయిన జీవితం శరత్ బాబుది.

శరత్ ప్రేమతత్వం :- శరత్ సాహిత్యంలో ప్రతిఫలించేది కరుణా జనకమైన ఉన్న తానురాగం, ఉత్కృష్టమైన ప్రేమ తత్త్వం, శారీరక సుఖాలను, బాహ్య సౌందర్యానికీ, తాత్కాలికమైన ఆకర్షణలకూ అతీతమైన మానసిక సంఘర్షణ-రెండు హృదయాల నిజమైన, నిస్వార్థమైన కలయిక. శరత్ సృష్టించిన ప్రేమ అవకాశవాదంకాదు _ అందాన్ని చూసో, ఐశ్వర్యాన్ని చూసో, వయస్సును చూసో, ప్రేమపేరిట కామానికి నిచ్చెన్లు వేసే కృత్రిమాభిమానంకాదు. ప్రేమికుల కోసం జీవితాన్ని, భవిష్యత్తునీ,సుఖాన్నీ, ఆనందాన్నీ, అన్నింటినీ Sacrifice చేసిన ఉన్నతమైన మానసిక ఆకర్షణ అది. జీవితంలో ఒకానొక దశలో వెల్లుబికి, తర్వాత చల్లారిపోయే తాత్కాలిక కెరటంకాదు, జీవితం సాంతం ముద్రవేసుకుని, ప్రభావితం చేసే శాశ్వతానుబంధం. శరత్ ఆరాధనకి గమ్యం కేవలం ప్రేయసీ ప్రియులేకాదు. చెల్లెలు _ తల్లి_ వదిన_ఇలా ఎన్నో రకాల వరుసల్లో స్త్రీ రూపసాక్షాత్కారాన్ని కావించి స్త్రీ వ్యక్తిత్వానికి జీవంపోసిన అక్షరశిల్పి శరత్.

రవీంద్ర కవీంద్రుడు స్త్రీ ఆరాధనని ఊర్ధ్వశీరూపమున భావజగత్తున కందించాడు. స్త్రీని తల్లిగా, చెల్లిగా, భార్యగా, ప్రేమమాతగా ఉపాసించాడు. అలాగే ఆప్తురాలిగా, సోదరిగా, ప్రేయసిగా, సౌందర్యజీవిగా, ఆత్మగా, ఆనందాన్నిగా, ఆవేదనగా ప్రతిరూపకల్పన చేశాడు శరచ్చంద్రుడు.

శరత్ సాహిత్యం :- ఒక్క రచయిత తన సాహితీ జీవితంలో ఒకటో, అరో గొప్ప నవలనో, కథనో అందించి ఖ్యాతిని ఆర్జిస్తాడు. కాని శరత్ విరచించిన ప్రతి కథా, ప్రతి నవలా, ప్రతి పాత్రా పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన గలిగింది. ఎవరి అభిరుచిని బట్టి వారు ఆయా నవలనో, ఆయా పాత్రలనో అభిమానిస్తున్నారు. అభిమానిస్తూనే ఉంటారు.

శేషప్రశ్న, పథేర్ దాబీ, మాధవీ, చరిత్రహీన్ _ ఇలా ఆయన రాసిన ఏ నవలని గొప్పదనీ, ఏ నవలని గొప్పది కాదనీ తేల్చగలం.

ఛాయాప్రకాశ్, పల్లీ, సమాజ్, అభాగినిస్వర్గం, బాల్యస్మృతి, పథనిర్దేశ్ మొ॥ కథానికల్లో దేన్ని అభిమానించకుండా ఉండగలం_

దేవదాసు, విప్రదాసు, శ్రీకాంత్, ఛాయ, వందన, చంద్రముఖీ_వంటి శరత్ పాత్రల్లో ఏ పాత్రని విస్మరించగలం_

మనసు పొరల్లో శాశ్వతస్థానాన్ని నిర్మించుకోగల స్మృతి సంకేతాలు శరత్ అక్షరాలు.

శరత్ రచనల సంక్షిప్తపరిశీలన :

విప్రదాసు :- ఒక ఉన్నతమైన వ్యక్తిత్వ సృష్టి విప్రదాసు నవల. విభిన్న రకాల మానసిక ప్రవృత్తులకీ, మానసిక సంఘర్షణలకీ చిత్రీకరణ ఈ నవల _ సతీదేవి _ ద్విజదాసుల మధ్య ప్రగాఢమైన వదిన ప్రేమ...దయామయికి బిడ్డల మీద అపారమైన మాతృప్రేమ...వీటన్నింటి కంటే విచిత్రమైనది వందన పాత్ర చిత్రణ_ఆమె ఒక typical character, వందనకీ, సుధీర్ కీ పెళ్లవుతుందని ఆమె తండ్రి రామ్ సాహెబ్ గారి ఆశ. కానీ బలరామపురం వాతావరణం మధ్య ఆ పెళ్ళికాస్తా ద్విజదాసు చేసుకోవాలన్న ఆకాంక్ష ఆమెలో ఒక కాంతి కిరణంలా దూసుకువచ్చి అదృశ్యమవుతుంది. తర్వాత అశోక బాబుతో ఆమె పెళ్ళి అని వందన పినతల్లి ఆశిస్తుంది. కానీ చివరికి అస్వస్థమైన కుటుంబ పరిస్థితుల్లోను, జమీందారీ కార్య నిర్వహణతోనూ, అలిసిపోయిన, ఒంటరివాడైన ద్విజదాసుకి తను అప్తురాలు. ఎంత అసాధ్యమైన విషయాల నైనా సాధించగల సమర్థురాలు _ "ఆపదల్లో ఆప్త మిత్రులు తమంతటతామే గుమ్మంలోకి వస్తారు" అన్నట్టు అత్యంత ఆపత్సమయంలో తోడునీడై వచ్చి ఆ యింటికి చిన్నకోడలైపోయింది _ ఈమధ్యకాలంలో జీవనగమనంలో ఎలాంటి వ్యామోహాలకూ, ప్రేమాభిమానాలకూ లొంగని

ఒంటరి జీవన పథికుడైన 'విప్రదాసు' యొక్క అసామాన్య వ్యక్తిత్వం వందన Psychic మీద ముద్ర వేసుకుపోతుంది. క్రమంగా వందన ఆరాధనకి సంకేతం విప్రదాసౌతాడు. ధ్యాన నిమగ్నుడైన విప్రదాసు మూర్తి దైవ సమానమైపోయింది వందనకి.

ఇలా విభిన్న పరిస్థితుల సంఘర్షణ ఒక నవలగానో, ఒక కథగానో కాకుండా_ఒక జీవితంలాగా, ఒక నిజంలాగా చదువరుల నిట్టూర్పులమధ్య సాగిపోతుంది_

బడీదిది :_ స్వేచ్ఛలేని జీవితంలో పావురంలా నింగికి ఎగరాలని ఆశించిన సురేంద్రుడి జీవనప్రయాణ మిది _ సవతి తల్లి ప్రేమలో పెరిగి, తన అవసరాలని తానే తెలుసుకోలేని అమాయికత్వంలో రోజుల్ని గడిపి _ ఒకనాడు విదేశాలకి వెళ్లాలన్న కాంక్షతో ఉన్నపళంగా కలకత్తాకి పారిపోయి వ్రజరాజు బాబు గారింట్లో ఆశ్రయాన్ని సంపాదిస్తాడు. అక్కడ ప్రమీల అనే ఒక చిన్న పిల్లకి చదువుచెబుతూ మాధవి సానుభూతికి పాత్రుడౌతాడు. మాధవి ఆ కుటుంబానికి కల్పతరువు. అందరికీ బడీదిది (పెద్దక్క). ఒక యువ వితంతువు. ఆప్యాయతలకి ప్రతిరూపం _ బడీదిదితో ఒక నెల రోజుల ఎడబాటులోనే సురేంద్రుడికి ఆమె అవసరం తెలియవచ్చింది. మబ్బుల మాటున దాగి_దాగి వెలికివచ్చిన సూర్యుణ్ణిచూడాలన్న కుతూహలంలాంటి భావోద్వేగంలోనే అమాయికుడైన సురేంద్రుడు మాధవిని చూడ్డానికి ఆమె గదిలోకెళతాడు. ఆ ఆలోచనా రాహిత్యమే_అతడా యింటిని వదలి, పరధ్యానం వల్ల ప్రమాదానికి గురికావలసిన స్థితికి తెస్తుంది. విషాదాంతమైన ఈనవల మానసికానురాగానికి ఒక మచ్చుతునక. బడీదిది_సురేంద్రుల మధ్య అంతర్గతంగా పెనవేసుకుపోయిన అభిమానానికి అర్థమేమిటో చివరివరకూ వారిరువురికీ తెలియదు. ఒక గుడ్డిప్రేమ. ఆమె నీడక్రింద తన జీవితాన్ని వెలిగించుకోగలనన్న ప్రగాఢమైన విశ్వాసమే సురేంద్రుడికి ఆపదల్లో, బాధల్లో 'బడీదిదీ' అనే జ్ఞాపకాన్ని పలికిస్తుంది.

కథ మొదల్లో జమీందారు బిడ్డైన సురేంద్రుడు ఆ తరువాత లాలతా గ్రామం జమీందారు. డబ్బు, అధికారం, అందమైన భార్య మొదలైన అన్ని సుఖ సంతోషాలున్నా అతని మనస్సులో ఏదో ఒక అవ్యక్తమైన వెలితి ఏదో అందని తీరాల కోసం అశాంతి ఏదో తోడు కోసం ఆవేదన _ ఆ ఆవేదనల అక్షర రూపమే బడీదిది మాధవి.

శరత్ బలహీనత :_ అత్యుత్తమమైన అమూల్య సాహిత్యాన్ని అందించిన శరత్ రచనల్లో అక్కడక్కడా స్వైర విహారం చేసే బలహీనత ఒకటుంది. అది శరత్ కాలం నాటి సామాజిక స్థితిగతుల ప్రభావంకావచ్చు. లేదా బెంగాలీ కుటుంబజీవన విధానాల ముద్రకావచ్చు- ఏదయితేనేం కానీ సాంప్రదాయ విజయం చాలాచోట్ల శరత్ నవలల్లో కనబడుతుంది_ పూజలు, పునస్కారాలూ, దానధర్మాలు, పాదధూళి స్వీకరించి శిరస్సున ధరించడం వంటి ఆచారాలూ, శాస్త్రోక్తంగా కట్టిన మంగళ సూత్రానికి ప్రాధాన్యం వంటి ఆచారాలు స్వామి, విప్రదాసు మొదలగునవలల్లో కనబడుతుంటాయ్. అలాగని మూఢాచారాలనూ, మూర్ఖపు కట్టుబాట్లనూ శరత్ గుడ్డిగా సమర్థించలేదు. కొన్ని సందర్భాల్లో సంప్రదాయ విజయం కనబడినా... పెక్కుచోట్ల కుసంస్కారాల మీద విమర్శ, మూఢనమ్మకాల మీద తిరుగుబాటు, శరత్ రచనల్లో వ్యక్తమవుతూఉంటుంది.

శరత్ మానవతావాది:_ శరత్ ని ఒక కాల్పనిక వాది అందామా ? భావ వాది అందామా _ ఆదర్శవాది అందామా _ యథార్థవాది అందామా _ నిరాశావాది అందామా_??? వీటిలో ఏ ఒక్క పదం శరత్ ని అలంకరించేంతటి సామర్థ్యాన్ని కలిగి ఉంది ? వీటన్నింటి కంటే ఉన్నతమైన కన్నీటినించి కల్పనల్నీ _ కల్పనల్నించి కన్నీళ్లని కురిపించిన మేఘ శకలమైన శరత్ ని 'మానవతావాది' అనగలం.

మానవుల కష్టసుఖాల్లోనే అతని నిరంతరమైన అన్వేషణ.
ఆ అన్వేషణ సాహిత్యంలో ఇంకా ముగియలేదు.
ఆ ఆరాధన ఇంకా ప్రేమలో నశించిపోలేదు.
అందుకే శరత్ భౌతికంగా ఈ లోకానికి దూరమైనా...
మనల్నివీడి శాశ్వతంగా ఇంకా అంతర్ధానం కాలేక పోతున్నాడు _ కాలేడు కూడా.

స్త్రీ పట్ల ఆరాధనలో, మానసిక సౌందర్యంలో, నిస్వార్థమైన ప్రేమతత్వంలో ప్రగాఢమైన జ్ఞాపకాల నిట్టూర్పుల విద్యుత్తులో శరత్ ఇంకా జీవించే ఉన్నాడు. శరత్ పాత్రలు సజీవంగా ఉన్నంతకాలం శరత్ జీవిస్తూనే ఉంటాడు.

(శరత్ 102వ జయంతి సందర్భంగా చెల్లాయ్ కే.ఝాన్సీరాణికి ప్రేమతో...)

# ఇప్పుడు

- శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు, ఎం. ఏ.

జగమును దొంగబుద్ధి యల
  సత్వము భీరుత మద్యమత్తతల్
తెగఁబడి పీల్చి పిప్పియొన
  రించుచు నున్నవి; ఎడ్డా వచ్చు నా
యుగపురుషుండు 'కల్కి' యిపు
  డుద్భవ మందిన వేయి బొండ్లముల్
పగిలిచి మ్రొక్కదే భరత
  వర్షము-రాడుగ! 'బద్ధకస్థుఁడై'

  ఈతఁడు దొడ్డరెడ్డి మఱి
    యీతఁడు యెడ్డెమనుష్యుఁడన్న దు
  ర్జాతి విభేదబుద్ధి నణఁ
    చన్ బెలుచున్ దలపెట్టి, లౌకిక
  ఖ్యాతికిఁ బ్రాకులాడు నరు
    లన్న నరాధిపు లన్న 'నీతి'కిన్
  రోతజనించు నెంచుకొనరో
    సమదృష్టిసమేతు నేతగన్.

కడుపున కింతయోగిరము
  కర్వయి పోయిన స్వీయదేశమున్
విడిచి పరస్థలంబులకు
  వే వలసల్ జనమేలు, చచ్చి కా
రడవుల పిట్టలై ప్రభవ
  మందుట మేలు-వృథాభిమానితం
బడి బ్రతికింప నేరని నృ
  పాలుని గొల్చుట కీడుఁ బిల్చుటే.

  పాతకరి కూళజాతికి, ప్ర
    భుత్వము శిక్ష యొసంగు కొద్ది దు
  ష్కృతములు విశ్వతోముఖ వి
    వృద్ధిఁ జెలంగెడు మొక్క పైతలల్
  చిదిమినపుట్టివచ్చు పలు
    రెమ్మలు కొమ్మల భంగి; భారత
  క్షితియెటువోవుచున్నదియొ!
    చెప్పఁగ సిగ్గు ప్రపంచ వేదికన్.



# ప్రేక్షచ్ఛాత్రులు

- శ్రీ కర్రా చంద్రశేఖరశాస్త్రి

[విశ్వేశ్వర శ్రీమన్మహాదేవుల నులివెచ్చని సెగ కెఱగై కాందిశీకు డగు వ్యాసదేశికునకు అంతేవాసులు అంజలి బంధంతో అణకువ చూపిన ఘట్టము]

అసల నాజవంజవ వి
  హారములం గడ కొత్తరించి సం
వాసము నేర్చి సజ్జన వి
  పశ్చిద పశ్చిమవీథి బ్రహ్మ జి
జ్ఞాసకుఁ బూజ్యపాదపద
  కంజసమీపముఁ జేరు కాశికా
వాసులు లబ్ధవర్ణులెటుఁ
  బల్కరు వచ్చియు బాదరాయణా!

  విలులిత చిత్తులౌచుఁ నిట
    వేలకుమించిన శిష్యు లెల్లరున్
  గలుమరమందుఁ జేరి భువిఁ
    గావులు సన్నగజాలు మోడ్పు కే
  లుల నయనాశ్రువారి తతు
    లూరఁగఁ జెంగటఁ జేరి చూడలే
  రలుక వహించి యున్నభవ
    దాననసీమను బాదరాయణా!

ఒకదెస దేశికోత్తముని
  యుజ్జ్వల దుర్గతపోవిభూతి, వే
ఱొకకడ విశ్వనాథు నిట
  లోద్గతకోపశిఖామహస్సు; నూ
రకబలవద్విరోధ మెటు
  రాదుకదా యని మౌన మూనుచుం
డికమక లాడఁ జొచ్చిరి మ
  దిం బుర వృద్ధులు బాదరాయణా!

  నుదుటను గంగమట్టి, కటి
    నుజ్జడలున్, శిఖ బిల్వపత్రమున్
  ముదిమినదించు శైవమత
    పూతసుభాషిత, మంగుళంబునన్
  బొదివిన దర్భముద్రిక, స
    ముజ్జ్వల సైకతలింగపూజయున్
  బదిలపుఁ బాదయంత్రనట
    నాకళలే కద బాదరాయణా!

(తరువాయి ప్రక్క పేజిలో)

# "పరం కవీనా మాధారమ్"

- శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

శబ్దము అనంతసామ్రాజ్యము. ఇక్కడ మహాప్రభువు వేదము. జ్ఞానస్వరూపమైన శ్రుతి మనుష్యలోకమును ఆదేశించును. మానవమనస్సు ప్రకృతితః ఇచ్ఛావిహారవర్తి. ఆజ్ఞలకు విధేయమై పడియుండు లక్షణము దానికి తక్కువ. అట్టిదానికి 'ఇది చేయుము, ఇది వలదు' అన్న శాసనములు ఎప్పటికో తేనెవిందులు పెట్టవచ్చును. అప్పటికి మాత్రము చేదుమందులు.

స్వేచ్ఛాసంచార శీలములు సుకుమారములు అయిన మానవాంతరంగములకు ఏకాంత విశ్రాంతి ఎక్కడ! అట్టఅడుగున ఉన్న స్వారస్యకాంక్షకు ఫలసిద్ధి ఎప్పుడు!

భావములు బహూపాధికములు. బహువిధప్రేరకములు. వానిని ఏకరసాభిముఖీనము చేయు సాధనమొకటి చూడవలెను. అప్పుడు-విశ్వశ్రేయస్సు!

ఆదిలో ఇది సృష్టికర్త సంకల్పము. సరస్వతీ సాహచర్య మాధుర్యముతో ఆతలంపు చిగుళ్ళుపెట్టినది. వాగ్దేవి చరణమంజీరముల అనురణితములలో కావ్యసుందరికి పుష్పోదయమైనది.

ఋషిభావుకులు కావ్యమును కాంతాసమ్మితముగా భావించిరి. కాంత తన మనోహరుని చిత్తమును రసవంతముగా ఆవర్జించుకొనును. ఆమె ఆజ్ఞాకలగళమున కలకండపుతీపియే కాని, చండత్వముండదు. తనలోపలి తలపులకు ఆమె చక్కని కథమలుపులు తెచ్చును. శరన్ముఖమున మేఘాంచలము మెరయు శశిరేఖవలె ఆమె హృదయము కొంత ప్రకాశము; కొంత అప్రకాశము. ఆమె నోడికారములోని రమణీయార్థరహస్య మేదో ప్రాణేశ్వరుని గుండెకు మాత్రమే ప్రతీయమానము కావలెను.

కాంతకువలెనే కావ్యమునకును వాచ్యార్థము ముఖ్యముకాదు. ప్రధానము వ్యంగ్యము. హృదయ పరిపాకముగల ఒక నాగరకుడు ఉపయోగించిన వాక్కు అతని హృదయపు లోతును అభివ్యక్తము చేయును.

వ్యంగ్యము ఎట్లులోకధర్మమో, అట్లే పరమేశ్వరధర్మము. భగవద్విషయమున వాచ్యార్థప్రకటనలకు నిలకడయుండదు. పరమతత్త్వము లోకవస్తువులచే అభివ్యంజితమగుచున్నది. సర్వవాక్క్రియలు సర్వమనస్సులు సర్వాణువులు ఆత్మతత్త్వవికసనమునే పరిస్ఫూర్తికి తెచ్చుచున్నవి. 'ఈశబ్దమునకు ఇది యర్థము' అన్నది ఈశ్వరసంకేతమైన శక్తి. అది ధ్వనిరూపము.

విశ్వహృదయమున పరమపురుషత్వము అవిచ్యుతముగా ప్రతిష్ఠితము కావలెను. ఒకానొక నరోత్తముని యితివృత్తముతో దానికి సూత్రపాతము జరుగవలెను. అట్టి పరమ స్పృహణీయ మహార్థమున సీతారాములు వాగర్థములుగా వేదోపబృంహణము చేయుచు రామాయణము స్వయంభువుగా నవతరించెను.

భారతసాహిత్యమున ఇది అనాది వ్యవహారము. కవియనగా వాల్మీకి! కావ్యమనగా రామాయణము! ఋషివరుల ఉద్ఘోష మిటులున్నది.

---

( 17 వ పేజీ తరువాయి)

చిజిమిన భక్తి సిమ్మ సర
సీరుహ సన్నిభ ముగ్ధచిత్తులై
పది మొదలాఱుపైఁ బడిన
బాల్యవయస్కులు ఖిన్నులౌచు నీ
పదముల నీడ నంటి తడఁ
బాటునఁ దొట్రిలుచున్న వార లీ
యదనున వారి నొక్కదర
హాసముతోఁ గను బాదరాయణా!

గగనధునీజలాల నవ
గాహము సేదును గాదు; సన్నిధిన్
విగళదమంద ధాత రుచి
వీచిక లీను శశాంక మౌళిపైఁ
బగయును గాదు; నందిగళ
భాగ నటన్మణిఘంటి కారవం
బు గటువ నీకు! శిష్యగణ
మోహము గాక యి! బాదరాయణా!!

# విద్యాలోకనము

— శ్రీ డా॥ వి. వి. యల్. నరసింహారావు, ఎం.ఏ, పిహెచ్.డి.



వెలసెడి విద్యాశాలలు,
చెలగెడి శిష్యులును, చదువుచెప్పెడి గురువుల్,
వెలసరి జీతమ్ములు, వి
ద్యలఅభ్యుదయమ్మునకు నిదర్శన మగునా?

కళలకు కాణాచు లుగ
గౌరవ మందుచు సర్వశాస్త్ర చి
త్కళ విరజిమ్ముచున్ వెలుగు
దారుల జ్ఞాన రథాధిరూఢులై
తొలిచదువుల్ మథించిన బు
ధుల్ పృథుశంఖములొత్తగా జగ
ద్వలయము చుట్టివచ్చి
రట భారత తాత్త్విక దేశికాగ్రణుల్!

అది ఒకనాటి గాథ; ఇపు
డా కథ చెప్పి ప్రయోజనంబు లే;
దదనున విత్తునాటి ఫల
మందుకొనన్ కృషిచేయగా వలెన్;
కొదువలు పూడ్చుకోవలె, అ
కుంఠిత దీక్ష హృదంతరంబునన్
కుదురు కొనన్ వలెన్; మసలు
కోవలె అందఱు ఒక్కమాటగా.

మాటలు మంతనమ్ములును
మానవతా మమతానురాగముల్
చాటగ, విద్యలందు చిర
సంస్కృతి బీజము నాటుకోవలెన్
కూటికి గుడ్డకై చదువు
కొన్నను విద్యలలక్ష్య మెప్పుడున్
గాటపు సౌమనస్యమున
కైకొనసాగట శ్రేయమాగదా!

గురుడన శిష్యుడన్న మన
కున్ పరిహాసపు పల్కులయ్యె; స
ద్గురువులు శిష్యసత్తములు
కోవెలలోపలి రాతిబొమ్మలా?
గురువులు శిష్యసత్తముల
కూరిమి ప్రోచుట, శిష్యసత్తముల్
గురువుల గారవించుట అ
గోచర వస్తువు లయ్యె నియ్యెడన్.

“వీరే మాగురువర్యులు,
వీరేమాశిష్యవరులు, వీరిశుభంబే
కోరుదు మెల్లప్పు” డనెడు
వారేరీ? నేడు కానబడరే ఎందున్?

చెప్పెడుపాఠముల్ వినరు;
శిష్యులతో పడలేక పాఠముల్
చెప్పడు పంతులయ్య; క్రమ
శిక్షణ పేరిట శిక్ష! దానితో
గుప్పునలేచు సమ్మె ఉరు
కుల్ పరుగుల్; సెలవాది తీర్పులై
ఎప్పటికార దిట్టిటులె;
ఈగతికాలము దొర్లిపోయెడున్.

గురుశిష్యుల్ మమతానుబంధమున ప
ల్కుండల్లి నర్తించుచే
కరణీయం; బిది ధర్మసూక్ష్మ; మిదియే
కర్తవ్య, మీధర్మ మం
దిరమం దన్యములైన చింతనములా
ర్తింగూర్చు; విద్యార్థులన్
పెఱదారిం జొరనీక దిద్దవలదా
పెద్దల్ సముద్యుక్తులై?

బిడ్డలగన్నవారు తమ
బిడ్డల నిత్తఱి రాజకీయపున్
గడ్డలుత్రొక్కనీక సరి
గా చదువుల్ చదివింపగా వలెన్;
దొడ్డమనస్సుతో గురువు
తోరపు విద్యల శిష్యకోటి కే
ర్పడ్డ కొఱత తీర్పవలె
భారత భారతి నుద్ధరింపగన్.

ఈనాభారత దేశము
నానాటికి పెంపుగాంచి నవజీవన వి
ద్యా నైపుణ్యము చూపగ
మానస మానందకందమై నవలొత్తున్.

# స్వాతంత్ర్యానంతరం తెలుగునవలా వికాసం

— శ్రీ సోమసుందర్.

ఈనాడు తెలుగులో నవలలు పుష్కలంగా వెలువడుతున్నాయి. కాని 1950ల తొలి ఏళ్ళల్లో 'తెలుగులో ఆధునిక జీవితాన్ని ప్రతిబింబించే నవలలు రావడంలేదని అందరూ పదేపదే హెచ్చరిస్తూ వచ్చారు. సర్వులూ ఆధునికనవల సుస్థురూపం గురించే ఆక్రోశిస్తూవచ్చారు.

ఆదశలోనే స్వర్గీయ డాక్టర్ పి. శ్రీదేవి 'కాలాతీత వ్యక్తులు' అనే తన నవలను తెలుగు స్వతంత్ర వారపత్రికలో ధారావాహిగా ప్రచురించారు. అప్పటికింకా యిన్నిసచిత్ర వారపత్రికలు లేవు. కాలాతీతవ్యక్తుల ఆవిర్భావంతో రెండు ప్రయోజనాలు ఏకదేశంగా సిద్ధించాయి. అటు స్త్రీల నవలారచనా పరంపరకు నూత్న జవసత్త్వాలు చేకూర్చడమూ, ఇటు ఆధునిక నవలా స్వరూపాచ్ఛ సంవిధానానికి ఆద్యపీఠికావడమూ జరిగాయి. అంతేకాదు; వారపత్రికలలో ధారావాహికంగా నవలలు ప్రచురితములైతే పాఠకులు ఆసక్తితో చదువుతారన్న వ్యాపారపు కిటుకూ బహిర్గతమైంది. దానితో ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక ఆవిర్భవించింది. ఆంధ్రసచిత్ర వారపత్రిక క్రొత్తపోకు లలంకరించుకుంది. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికలసచిత్ర వారపత్రికలు పోటాపోటీలతో క్రొత్త నవలలను_సమకాలీన జీవితచిత్రణ ప్రధానం కావాలన్న ప్రాథమిక వాంఛితంతో_ ధారావాహికలను ప్రచురించనారంభించాయి. అంతేకాదు, దరిమిలా ఉగాది నవలల పోటీలు ఏర్పాటుచేసి, ఆకర్షణీయమైన మొత్తాలను బహుమతులుగా ప్రకటించి, తెలుగులో ఆధునిక సమకాలీన జీవన ప్రతిబింబా లయిన నవలలు ఆవిష్కరింపబడడాని కెంతో దోహదం చేశాయి.

శ్రీ మహీధర రామ మోహనరావు దేశీయ స్వాతంత్ర్య పోరాటాలలో గడచిన రసత్తర సన్నివేశాలను ఎన్నుకొని భారతజాతీయ చరిత్ర ప్రతిబింబాలయిన నవలలను రాయనారంభించి ధారావాహికంగా విశాలాంధ్రాది పత్రికలలో ప్రచురించారు. ఓనమాలు, రథచక్రాలు, కొల్లాయికట్టితే నేమి? వంటివి_స్వాతంత్ర్య - పోరాటాన్ని అన్వయించడమే గాక, మార్క్సియదర్శనంలో వ్యాఖ్యానించాడానికి కూడ ఎంతగానో ఉపయుక్తమయ్యాయి. వీరి నవలలు కాలానుగతంగా (cronological) రచనను సాగించక పోయినా, భారతస్వాతంత్ర్య పోరాట చరిత్రను సమీక్షచేసిన ప్రథమ నవలలుగా గుణుతికెక్కాయి.

ఆదేదశలో శ్రీవారణాసి సత్యనారాయణ మూర్తి అబల, అల్పజీవులు, ఇహాపరాలు, కోనేరు_సెలయేరు, వంటి నవలలను వినూత్న సంవిధానంతో, వినూత్న జీవనదర్శనంతో సామాజిక, వాస్తవికతా ప్రదర్శకాలుగా రచించారు.

తదాదిగా 1950_65 మధ్యకాలాన్ని ఒకదశగా మనం భావిస్తే, యీకాలవ్యవధిలో సుమారురెండు వందల నవలలు వెలువడ్డాయి. అందులో అధికసంఖ్యాకాలు స్త్రీలు రచించిన నవలలే! ఈసంఖ్యాబలంలో గుణదార్ఢ్యం లుప్తంకావడం సహజమే. తొందరగా నవల వ్రాసి ముగించి, పోటీకి పంపించి, బహుమతి సంపాదించాలన్న ఆరాటమే రచయిత్రులకు ప్రధానమైందితప్ప, ఏ ఒక వర్జీనియా ఊల్ఫులాగో సావధానచిత్తంతో, సంవిధానచాతుర్యంతో నవలలను ఉత్తమ కళాఖండాలుగా తీర్చిదిద్దాలన్న తపస్సు మృగ్యమైంది. తమకుగల పరిమిత జ్ఞానంతో, సంకుచితదర్శనంతో నవలా రచన కుపక్రమించిన రచయితలు, తమకందని ఆనందంలో విహరించ నారంభించారు. ఊహాజన్యమైన సన్నివేశాలతో, ఆదర్శమూర్తుల చిత్రణతో - తమ అతృప్తవాంఛావాగుర నుంచి బయటపడాలన్న ఆరాటాన్నే అతి వేలంగా ప్రదర్శించారు. ఇలాంటివారికి శరత్ బాబు నవలలోని ఆదర్శపాత్రలు లక్ష్యభూతమయ్యాయి. మంచికైనా చెడుకైనా, స్వాతంత్ర్యానంతర_తెలుగు నవలాసాహిత్యంపై శరత్ చంద్ర చటర్జీ పరపిన ప్రభావముద్ర విస్మరింపతగింది కాదు.

ఈదశలో గణనీయమైన వైయక్తిక వైశిష్ట్యంతో నవలలు రచించి, స్వీయముద్రతో కీర్తిస్తంభాలుప్రతిష్ఠించిన రచయిత్రు లిరువు రున్నారు_వీరు, రంగనాయకమ్మ, లతగార్లు. ఇరువురూ పాఠకునిపై చెరగనిముద్ర లగించడంలో శక్తిమంతులే. నవీన యోజనాధారతో, వినూత్న నైతిక మూల్యాలతో, అధునాతన జీవన విధానంతో స్త్రీపురుషుష సంబంధాల పరిణామాలను శక్తివంతంగా వీరిరువురూ ఎవరి ధోరణిలో వారుగా తమ నవలలలో ప్రతిబింబిచారు. ఇందులో మొదటివారి యోజనా ధోరణి హేత్వధీనమూ తార్కిక నిబద్ధమూ, వాస్తవికతా ప్రయోక్తమూ కాగా, రెండోవారి విధానం, వర్తమాన సామాజిక నీతుల ఉక్కుచట్రాన్ని భేదించాలన్న చలం వారసత్వాన్ని పుణికి పుచ్చుకొన్నది. ఆధునిక తెలుగునవలలపై శరత్ బాబు ప్రభావం తర్వాత, గణనీయమైన ప్రభావం కలిగించినవారు శ్రీచలం ఒక్కరే!

గోపీచంద్, కుటుంబరావు, బుచ్చిబాబుగార్లు నేపథ్యగాయకులుగానే మిగిలిపోయారు తప్ప, తమ ప్రభావరశ్మిని ప్రత్యక్షంగా ప్రసరించలేకపోయారు.

ఇటుపురోగమనవాదానికి చూపుడువేళ్ళుగా పైని పేర్కొన్న నవలాకారులుం ప్రకాశిస్తే, ఒక్క విశ్వనాథ సత్యనారాయణగారు గోదావరీ పరీవాహము నడ్డగించిన పాపికొండవలె నిలచి ఆశ్లేషపౌరుషేయ సంప్రదాయాలను పునరుజ్జ్వలింపచేయుడానికి నిర్విరామకృషి సల్పుతూనే వచ్చారు. వీరి శతాధిక నవలలకు లక్షలాది పాఠకులున్నారేతప్ప, తదుపరి వచ్చిన ఏ నవలారచయితపైనా వీరి ప్రభావముద్ర పడిందనడానికి దాఖలాలు కానరావు.

మారుతున్న విలువలను అరికట్టజూచే సంప్రదాయనైతిక సిద్ధాంతాలపై తిరుగుబాటుగా, స్త్రీ, పురుషసంబంధాలలో స్వేచ్ఛాప్రవృత్తికి బాసటగానిలచే అరాజక పితూరీలుగా శ్రీమతి లత నవలలు యువతీయువకులలో అశేషప్రభావాన్ని కలిగించాయి. ప్రతీపవాదాన్ని విశ్వసించే వారిలో విశ్వనాథ సత్యనారాయణగారికెంత విశాల పాఠకలోకముందో-అంతకంతా లత సాహిత్యానికి పాఠకలోకమున్నదనడం అతిశయోక్తికాదు.

ఈరెండు దశాబ్దాలలోనూ అసంఖ్యాకనవలలువ్రాసి ప్రఖ్యాతలైన రచయిత్రులెందరో ఉన్నారు. కొందరినైనా పేర్కొనాలంటేనే పెద్దపట్టిక తయారవుతుంది. శ్రీమతులు మాలతీచందూర్, కె. రామలక్ష్మి ఆరుద్ర, యద్దనపూడి సులోచనారాణి, కోడూరి (అరికపూడి) కౌశల్యాదేవి, ద్వివేదుల విశాలాక్షి, వాసిరెడ్డి సీతాదేవి, సి. ఆనందారామం, కావిలిపాటి విజయలక్ష్మి, ఆర్. వసుంధర, నిడదవోలు మాలతి, ఉన్నవ విజయలక్ష్మి, మాదిరెడ్డి సులోచన, ప్రభృతులు తెలుగు ఇంటి ఆడపడుచులెందరో సాహితీ జీవనరంగంలో ప్రవేశించారు. పుంఖానుపుంఖంగా నవలాసాహిత్యాన్ని సృష్టిస్తున్నారు అన్నిరంగాలమాదిరిగానే సాహిత్యరంగంలో కూడా మహిళలప్రవేశాన్ని సాహిత్యాభిమానులు హృదయపూర్వకంగా హర్షించి, ఆహ్వానించాలేతప్ప-ఏవో కుంటిసాకులతో వెక్కిరించి, అభిశంసించడం ఆరోగ్యదాయకం కాదు. ఉత్తమ సాహితీనికషోపలాలపై తరచి పొల్లులు తేల్చడం విమర్శ కాగలదుకాని, స్త్రీలేమిటి నవలలేమిటనే అహంకృతితో అవహేళన చేయడం సాహిత్య విమర్శ అనిపించుకోదు.

స్త్రీల నవలలద్వారా ఆధునికాంధ్ర సాహిత్యం ఒక ఏభయిసంవత్సరాల వెనుకకు నెట్టివేయబడిందని శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ సమ్మార్జనీ విన్యాసం చేయడం సాహిత్యవిమర్శ కాదు. పురాణమిత్యేవ న సాధు సర్వం అనుకుంటూ యిలాంటి సూత్రీకరణలను విస్మరించవలసివస్తుంది.

మధిర సుబ్బన్న దీక్షితులుగారి కాశీమజిలీలకు ఆధునిక ప్రతిరూపాలనదగిన స్వకపోల కల్పితాలను మాత్రమే స్త్రీలు సృష్టిస్తున్నారని శ్రీగోరా శాస్త్రి కూడా ఒక తీవ్రకశాఘాతాన్ని తగిలించారు. ఈసూక్తి స్వోపపత్తికంగా విమర్శానుసంధానమైతే పరిగ్రాహ్యమే!

ఏమైనా స్త్రీలనవలాసాహిత్యం యిటు సామాన్య పాఠకులలో, అందునా వంటింటిపనులు ముగించుకొని భర్తలను ఆఫీసులకు పంపిన తర్వాత చిక్కిన తీరిక సమయాలలో సీరియల్, నవలాసాహిత్య పాఠకురాండ్రైన మధ్యతరగతి గృహిణులలో విపరీతఆదరణను చూరగొంటోంది. అటు మేధావులలో, అంటే వర్తమాన ప్రపంచనవలాసాహిత్యాన్ని అంతో యింతో సేవించి ఒక నిశితబుద్ధిని అలవర్చుకొన్న ఆలోచనాపరులలో స్త్రీల నవలాసాహిత్యం పట్ల తూష్ణీంభావమూ ఏర్పడుతోంది. అనగా వెరసి స్త్రీలనవలలు వివాదాస్పదా అవుతున్నాయే తప్ప నిర్వివాదసమాదరణను పొందడంలేదన్నది ఖాయమే!

ఏమైనా లలనల నవలల పట్ల వస్తున్న వ్యతిరేకవిమర్శలో కొంత సత్యం లేకపోలేదు. కాని, అది హీనధోరణులకు ప్రాతినిధ్యంవహించే ఒక పార్శ్వానికిమాత్రమే చెందుతుంది. అంటే అర్ధసత్యాలనో, పాక్షిక సత్యాలనో ఆధారంచేసుకుని విమర్శకులు దురహంకార ప్రదర్శన చేయడం మేలుచేకూర్చదు. Intellectual Arrogance ను తోడు తెచ్చుకొని మొత్తం స్త్రీ నవలా సాహిత్యాన్నంతమూ తుడిచిపెట్టే - సార్వత్రిక కఠోర విమర్శనా సమ్మార్జనుల నెక్కుపెట్టడం భావ్యంకాదు.

స్త్రీల నవలల్లో అత్యధిక భాగం నిత్యజీవనయాథార్థ్యాలకు పరాఙ్ముఖత్వం ప్రకటించిన మాట సత్యదూరం కాదు. వర్తమాన సమాజంలో స్త్రీ అసంఖ్యాకంగా complexes విషవలయంలో గుడిసుళ్లు తిరుగుతున్న మాటా నిజమే. ఆ కాంప్లెక్సెస్ రచయిత్రులైనంత మాత్రాన అంతచప్పున విడిచేవికావు. కనుకనే రచయిత్రులు వ్యక్తిగతంగా తమ హృదయకుహరాలలో మరిగే తీరని కోరికలకు తమ నవలలలో ప్రతీకలు నిల్పుతున్నారు. నాయకనాయికా సంబంధాలను తమ తీయని ఊహాలతో మలుస్తున్నారు. కార్లూ మేడలూ అవలీలగా సాధించుకొన్న సంపన్నయుపాత్రలేతప్ప-తమ సృష్టికి సాధారణులు అందడం లేదు. కేవల ఊహాజనిత సన్నివేశాలతో అసంస్కార పాఠకులలో భ్రమలు కల్పించడంద్వారా తేలికగా విజయం సాధించే ఎత్తుగడలను పన్నుతున్నారు. జీవన వాస్తవికతల గడ్డునేలను విడిచి గాలిలో సాముచేసే ఇతివృత్తాలలో అసంఖ్యాక నవలలు అలవోకగా ఉత్పత్తిచేసి పారేస్తున్నారు.

ఒక యువరచయితకు సలహాయిస్తూ మాక్జిమ్ గోర్కీ ఒక గొప్ప మాట చెప్పాడు. "నువ్వు నవలో కథో వ్రాయదల్చుకున్నావో వెళ్ళి జీవితాన్ని పరిశీ

లించు; ఎన్నడూ ఊహించకు!” అన్న మాటలో ఎంత అర్థం ఉందో, ఈ సూక్తికి వర్తమాన నవలాసాహిత్యం ఎంత దూరంగా ఉందో ఆలోచించ వలసిన అవసరం ఉంది.

మన రచయిత్రులలో అధిక సంఖ్యాకలు ఆంగ్లవిద్యాభూషణలే! ఆంగ్లభాష ద్వారా ప్రపంచ నవలా సాహిత్యంలోని మణిస్తంభాలవంటి నవలలను అధ్యయనం చేసి తమ భావుకత్వాన్ని అభివృద్ధి చేసుకోవచ్చు. కాని అది చాలా కష్టంతో కూడిన పని. తేలికగా కీర్తి సంపాదించుకోకలిగే మార్గాలెన్నో ఉన్నప్పుడు అనవసరంగా కష్టపడమని ఎవరు చెప్పారు? కనుకనే కొందరు_ఇటీవలి ఆంగ్లసాహిత్యంలో వెలువడుతున్న చౌకబారు నవలలలోని యితివృత్తాన్నో, పాత్రలనో, మన సామాజిక వాస్తవికతతో నిమిత్తం లేకుండా_యథాతథంగా నిలువుదోపిడీ చేయడమూ కనిపిస్తుంది. అయితే సాహిత్యంలో జరిగిన చోరీ గురించి ప్రస్తావించ దలచినపుడు_మనమెంతో వెనక్కి వెళ్ళి ఘనకీర్తిమంతులెందరినో వరుసగా బోనులో నిలబెట్టి విచారణ చేయవలసి వస్తుంది. కనుక గ్రంథచౌర్యదోషం ఒక్క రచయిత్రులపైనే ఆరోపిస్తున్నానని కాని, రచయితలను_అందునా మహారచయితలను మినహాయిస్తున్నానని కాని ఎవ్వరూ అపార్థం చేసుకోనక్కరలేదు. అది ప్రసక్తాంతరం కనక విడిచి పెడుతున్నాను.

కౌసల్యాదేవి రాసిన నవలా చక్రాల కొన్నింటికో ఆంగ్లమూలా లున్నాయని ఆ మధ్య పత్రికలలో రగడ జరగడం అందరూ ఎరిగినదే! ప్రఖ్యాత అమెరికన్ రచయిత ఆ మధ్యనే కీర్తిశేషుడైన స్టీన్‌బెక్ రచించిన ‘A short reign of Pippin the IV’ అనే పెద్ద పఖ్యాతి పొందని నవల శ్రీ పాలగుమ్మి పద్మరాజుఅంతటివాడినిప్రలోభపరచింది. పాపం ఆయన దానిని మక్కికి మక్కీగా తెలుగులో “రెండవ అశోకుడి మూణ్ణాళ్ల పాలన” గా దిగుమతీ చేసి, స్వీయరచనగా పత్రికల్లో ప్రచురించగా దుమారం రేగడమూ చాలా మందికి జ్ఞాపకం ఉండే ఉంటుంది.

అలాగే గోర్కీ_మహాశయుడు ఎంతో ఆశావహంగా రచించిన “ఫోమా గార్డియేవ్; ఎ మేన్ హు వస్ ఎఫ్రయిడ్” అనే నవలలోని మౌలికమైన ఆశావాదాన్ని నిరాశావాదంగా మార్చి తెలుగులో స్వర్గీయ గోపీచంద్ ‘అసమర్థుని జీవయాత్ర’గా దిగుమతి చేశారు. అలాగే అతిలోకమనోహర పాత్ర మాల్వా (గోర్కీ_దే) ను శ్రీ చలం శావలిసిగా మూలరచయితను సంస్మరించకుండా ఆంధ్రీకరించారు. మూలగ్రంథాలకూ ఆంధ్రీకృత గ్రంథాలకు గల సామ్యాలూ భేదాలూ బేరీజు వేస్తూపోతే చాలా గ్రంథమే అవుతుంది.

ఇలాంటి నీహార లేశాలమాటకేంగాని, యీ మధ్య ఎన్ని నవలలు వెలువడు తున్నదీ తెలుసుకునేందుకు, ప్రధానంగా ఎమెస్కో పాకెట్ బుక్స్ లిస్టు చూస్తే తెలుస్తుంది. ఒక్క ఎమెస్కో వారేకాక అసంఖ్యాకంగా ప్రచురణ కర్తలు బయల్దేరి పోటాపోటీలుగా నవలా ప్రచురణకు పూనుకున్నారు. అంటే నవలా రచన ఒక కళాహేలగా కాక ఒక వృత్తిగా మారింది. ఈ రెండు దశాబ్దాలలోనూ తెలుగులో నవలకు ఎంత ప్రాధాన్యం వచ్చిదంటే _ అసంఖ్యాక ప్రచురణ కర్తలు నవలల్ని తప్ప ఇతర సాహితీ ప్రక్రియలను ప్రచురించడానికే పూనుకోవడంలేదు. దీని వల్ల ముద్రిత సాహిత్యాన్ని చూస్తుంటే నవలల భారంతో ఒరుగొమ్ము ( Lope sided ness) ఏర్పడి_ఆగతకాలంలో నాలుగైదు దశాబ్దాలలో ఇతరేతర సాహిత్య ప్రక్రియలకు సంపూర్ణగ్రహణం పడుతుందేమో నన్నంత భయం ఏర్పడుతోంది.

ఈ వ్యాపార ఆకర్షణవల్ల_ఏవో లబ్బేడు పేజీలూ, బొచ్చెడు ప్రకరణాలూ ఉంటేచాలు నవలగా మార్కెటుకు ఎక్కించవచ్చన్న అలుసు అటు ప్రచురణ కర్తలలోనూ, ఇటు నవలాకారుల్లోనూ కూడా వ్యాపించింది. నవలా రచన ఒక అమూల్య కళాసృజన అనే స్థితినుంచి, ఒక కుటీర పరిశ్రమగా, చేతివృత్తిగా మారిపోవడం హర్షణీయం కానేరదు.

ఈ దురన్యాయానికి ఎవరో ఒకరు ఎర్రజెండా చూపవలసిన అవసరాన్ని గాఢంగా గుర్తించి మాత్రమే శ్రీయుతులు గోరాశాస్త్రి, పురాణం సు. శర్మ వంటివారు అంతటి నిష్కర్షకు, నిష్కరుణకూ పూనుకోవలసి వచ్చిందే తప్ప, రచయిత్రులలో ఉత్తమ నవలా కారిణులు కొందరున్నా రన్న సత్యం తెలియక కాదు.

నేటి తెలుగు నవల సమకాలీన నవలగా పరిఢవిల్లుతూన్నదే తప్ప_సమగ్రతర ఆధునిక నవల అనిపించుకోగల శక్తిని పుంజుకోలేక పోతోంది. దీనికి ప్రధానకారణం నేటి నవలాకారుల్లో అధికసంఖ్యాకులకు ఆధునిక విషయ విజ్ఞాన సంపద కొరవడ్డమే. అర్ధప్రతిభులూ, అల్పప్రతిభులూ అసంఖ్యాకంగా ఈ రంగానికి ఆకర్షితులు కావడమే కాక, పురస్కారాలకు అర్హులు కావడమూ మరొక కారణం; వ్యుత్పన్నతా శూన్యులు అసంఖ్యాకంగా నవలా ఉత్పత్తికి పూనుకొని, భుజబల సంపదను ప్రదర్శించడం కూడా వేరొక కారణమే.

(సశేషం

"వేద వేద్యుడైన పరమ పురుషుడు దశరథాత్మజుడు కాగా, వేదము ప్రాచేతసద్వారమున రామాయణ మాయెనట!" 'నానృషిః కురుతే కావ్యమ్' అను నుక్తికి ఆనాడు ఉగాదిపర్వము.

కవిత్వావతార ప్రథమ తీర్థముగా సంకీర్త్యమానుడైన మహర్షి వాల్మీకి తమసా నదికి స్నానార్థము వెళ్ళిన ఒక నాటిసంఘనము. శిష్యుడు భరద్వాజుడు వెంట నున్నాడు. స్నానమునకుముందు వాల్మీకి వల్కలధారియై నిలబడి ప్రకృతి సుందరమైన విశాల విపిన ప్రాంతమును చూచుటకు ముచ్చటపడెను. ఇంతలో ఒక అకాండపాతము!

వ్యాధు డొకడు చెట్టుకొమ్మపై విహరణశీలములై ఉన్న పక్షుల జంటలో మగపిట్టను బాణముతో కొట్టెను. శరవిద్ధమైన ఆపక్షికాంత పాపము! వాపోవుచుండెను.

చూడగా, ధర్మోదారమైన ఋషి హృదయము దాని ఆక్రందనమున కరుణార్ద్రమయ్యెను. వ్యాధుడు చేసిన పని ఋషికి క్రోధముకల్గించెను.

"మానిషాద ప్రతిష్ఠాంత్వ
మగమశ్శాశ్వతీస్సమాః,
యత్ క్రౌంచమిథునాదేక
మవధీః కామమోహితమ్"

"ఓకిరాతుడా! కొంచపిట్టల జంటలో కామవశమైన మగపుల్లును బలిగొంటివా? నీవిక పెక్కేండ్లు బ్రతుకవురా!"

ఇది బోయవానికి వాల్మీకి తిట్టు.

శిష్యుడు భరద్వాజుడు ఋషి వాక్కు విన్నాడు. ఆశాపము వట్టిమాటలు కావు. ఆ పదములు నాల్గుపాదముల గ్రథనము - ప్రతిపాదమున సమాక్షరములు. అనుష్టుప్ ఛందో వైఖరి. అతర్కితముగా ఇట్లు తనలో నుండి వెలువడిన ఛందోవాణికి ఋషి అబ్బురపడెను. ఆకస్మిక ప్రత్యవభాసమైన ఆశోక శ్లోకము సప్తకాండాత్మకమైన భవిష్యత్కావ్యగాథకు అంకురారోపము. ఈ సంఘటనము వెనువెంట బ్రహ్మ వాల్మీకికి దర్శనమిచ్చి -

"శ్లోక ఏవ త్వయా బద్ధో
నాత్రకార్యా విచారణా.
మచ్ఛందాదేవ తే బ్రహ్మన్
ప్రవృత్తేయం సరస్వతీ."

నీనోట ఈ సరస్వతి యిటులు వెల్వడుట నా సంకల్పము. రహస్య ప్రకాశరూపముగా ఉన్న రామేతి వృత్తమును కావ్యముగా రచింపుము. నీ ప్రజ్ఞకు అవిదితమైనది ఏదీ ఉండదు. నా కావ్యమున అనృతవాక్కు ఉండదు.

యావత్ స్థాస్యంతి గిరయ
స్సరిత శ్చ మహీతలే,
తావద్రామాయణకథా
లోకేషు ప్రచరిష్యతి,
యావద్రామాయణకథా
త్వత్కృతా ప్రచరిష్యతి
తావదూర్ధ్వ మధశ్చత్వం
మల్లోకేషు నివత్స్యసి"

ఏతాదృశమైన బ్రహ్మానుగ్రహము వాల్మీకి లోకోత్తర ప్రతిభకు మారాకు హత్తెను. తపస్స్వాధ్యాయ నిరతుడు వాగ్విదాం వేత్త అయిన నారదుని ఉపదేశము దానికి భూమిక తీర్చెను.

విశ్వసారస్వతమున 'వాల్మీకము' కావ్యశాఖకు శ్రీకారము.

'మధుమయఫణితీనాం మార్గదర్శీమహర్షిః'

శిక్షావ్యాకరణాది షడంగములు - చతుర్వేదములు - తద్గురుపరంపరాధ్యయనము యొక్క అనాదిత్వము అప్రతిహతమైనది. ఇక సాహిత్య శాస్త్రము లేక 'అలంకారశాస్త్రము' యొక్క ప్రభవకాలము ఏది! అనెడి జిజ్ఞాస ఒకటి యున్నది. లోకమున కావ్యము లక్ష్యము. తల్లక్షణము అలంకారశాస్త్రము. లక్షణమునుబట్టి లక్ష్యము-ఇది సాధారణముగా చెప్పుకొనుమాట.

మరి - 'లక్షణము లక్ష్యమూల' మనుటకు ఆదికావ్యము వాల్మీకము కంటె ఉదాహరణ మేమి కలదు! 'పరం కవీనామాధారం' అని రామాయణము ఎలుగెత్తి ఊర్ధ్వబాహువై చెప్పినది.

రామాదివత్ప్రవర్తితవ్యం। న రావణాదివత్' అన్న ఉపదేశ రూపవ్యంగ్యమర్యాదకు గతి కల్పించిన కావ్యము వాల్మీకము. ఒక చేత తపోవన సంస్కృతి వేఱొకచేత అసురసంస్కారమునకు తిరస్కారము చేసి చూపిన ప్రథమ శిల్పి వాల్మీకి. ఆయన ప్రతిభావైభవము అటు భారతీయగృహస్థాశ్రమధర్మమునకు ధర్మకవచము. ఇటు సాహిత్య సౌందర్యమునకు మాణిక్య మకుటము. మనోహరములైన సమాససంధియోగములతో మధురోపనతార్థములైన వాక్యములతో తదనంతర కాలికులైన భాసకాళిదాస భవభూతి భట్టబాణ మయూరాది మహాకవులకు ఒజ్జబంతులు పెట్టిన రసవన్నిర్మాణము రామాయణము.

అసితకేశాంతా - పద్మపలాశాక్షీ - రామేక్షణా - అభిరక్తకంఠీ - క్లిష్టకాశే యవాసినీ-రాజీవలోచనః.

ఓహో! ఏమి శబ్దలావణ్యము! సృష్టి ప్రథమ ప్రత్యూషమున వీచిన పవనాంకురములుకాని, అవి పదములుకావు. వాల్మీకి వర్ణనములు అలంకారికులకు లక్ష్య భిక్షపెట్టినవి.

దర్శయంతి శరన్నద్యః
పులినాని శనైశ్శనైః
నవసంగమ సంవ్రీడా
జఘనానీవ యోషితః॥
చంచచ్చంద్ర కరస్పర్శ
హర్షోన్మీలిత తారకా
అహో! రాగవతీ సంధ్యా
జహాతి స్వయ మంబరమ్"

శృంగారరస సర్వస్వమునకు ఆకరములైన ఇట్టి శ్లోకములు వ్యాఖ్యామనోగ్రాహులు. లోపల, రసనలపై పలుకు బళ్ళుగా విహారము చేయుచున్న శ్లోక చరణములు కోకొల్లలు. అరావణ మరామంవా - రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ-స్మారయే త్వాం న శిక్షయే ఏతిజీవంతమానందః నరం వర్ష శతాదపి - మమైవ దుష్కృతం కించి న్మహదస్తి న

సంశయః_జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపి గరీయసీ - ఇట్లే ఎన్నో !

రామవిప్రలంభ ఘట్టములో 'వాహి వాత! యతః కాంతా తాం స్పృష్ట్వా మా మపి స్పృశ'_అన్న మాట గుండెను పిండి వైచును. ఓపవనమా ! నాప్రియురాలు ఏదెస నున్నదో ఆమెను స్పృశించి మఱి నన్ను స్పృశింపుము.

కిష్కింధలో రామసుగ్రీవులకు మైత్రి ఏర్పడెను. అక్కడి సందర్భము.

“సీతా కపీంద్ర క్షణదాచరాణాం। రాజీవహేమజ్వలనోజ్జ్వలాని। సుగ్రీవరామ ప్రణయప్రసంగే ! వామాని నేత్రాణి సమం స్ఫురంతి”

రామసుగ్రీవుల ప్రణయ ప్రసంగములో ఒక్కసారిగా సీతకు, వాలికి, రావణునకు ఎడమకన్నులు అదరెనట ! స్త్రీ యైన సీతకు ఎడమకన్ను అదరుట శుభము. పురుషులగు వాలి రావణులకు అది అశుభము. ఆలంకారికపు సొగసులు వాల్మీకములో ఇట్టివి రొక్కారొక్కములు.

కవిత్వచారుత్వమునకు ఎట్లుమూలాధారమో, ధర్మవైశిష్ట్యమునకు వాల్మీకము అట్టి నిదానము.

శ్రీరామా లక్ష్మీపరము. అయన మనగా స్థానము. అటులు భావించినచో శ్రీరామాయణము సీతారామ చరిత్రము. “సీతాయాశ్చరితం మహత్”_

స్పృహణీయమైన రసానందముతో పాటు వాల్మీకము మహిమసిద్ధి ప్రదమైన గ్రంథము. తలిదండ్రులయెడభక్తి, సోదరప్రీతి, జ్యేష్ఠానువర్తనము, లోకమర్యాదానుసరణము, ప్రతిజ్ఞాపాలనము, ఆశ్రితవాత్సల్యము, స్వామికార్యనిర్వహణము, స్వార్థపరత్వనివృత్తి, చిత్తశుద్ధి - ఏతాదృశ గుణగణములను తన కావ్యద్వారమున వాల్మీకి సురభిళముగా ప్రపంచమున ప్రసారముచేసెను. వాల్మీకి ప్రతిభాసమున్నతవాణి సర్వదేశములకు సర్వజాతులకు సర్వసారస్వతమునకు సమశ్రుతికమైన ప్రణవనాదము.

# అందని చిరునవ్వు

- శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, ఎం. ఏ.

మౌన సాగాధ సీమలలోన మునిగి
కలల కలతల నిదురించు జిలుగు లెల్ల
వలపుల మనోజ్ఞమాలగా మలచి తెచ్చి
ఒక్క చిరునవ్వు గూర్చి నిట్టూర్చినాడ

ఆ చిరునవ్వు నాదుహృదయాంతర నిత్య విషాదసీమలో
పూచిన పుల్కరింత యయి మూలములన్ కదలించివేసెడున్
ఆ చిరునవ్వు నాదు జననాంతర నిత్యరసజ్ఞ భావనా
వీచిక లెల్ల స్వప్నమధువీథులలో దహియించివేసెడున్

ఆ నగవు నాదుజీవిత కాననమున
ఆ కసమ్మును తాకు ఏకాంత దుఃఖ
పరమ కాల లతాగ్ర విభాసమాన
రక్తరాగమ్ము పాడు గులాబిపూవు.

ఆ చిరునవ్వునాదు కను లందున కప్పురమట్లు మంటలై
వీ చెడునట్లు హత్తుకొని ప్రేమికులెల్లర గుండె గూడులన్
తోచెడు నిత్యహారతుల నూతనకాంతుల నాట్యమాడగా
చూచెదగాని; అద్ది కనుచూపులలోపల మాయమైచనున్

చాచినట్టి నాచేతికి చందమామ
తాకునో అన్న రీతిగా దగ్గరగును
క్షణములో దూరదూరమై కరగిపోవు
ఆనగవు నాదుహృదయాని కగ్గి వెట్టి

దాని చూచెడు నప్పుడు దాచుకొన్న
కలలు కన్నుల పొగలుగా కదలివచ్చు
దానికిని దూరమైనపుడు దాగియున్న
కవిత, చీకట్ల కాల్వలై కరగిపోవు.

ఆ చిరు నవ్వు నా మనసు నందున ఆరని అగ్నిగుండమై
నాచిరకాల భావనల, నంతముగా నుడికింప పొంగులై
తోచెడు అశ్రువాహినులతో పదమాలికలల్లుకొంచు; ఇ
ట్లే చరియింతు దారి కనిపించని శూన్యపథాలలోపలన్.

# ప్రబంధకవులు - స్త్రీవర్ణన

- శ్రీ కపిలవాయి లింగమూర్తి

అర్చనాసమయంలో అంగపూజవలె మనకావ్యాల్లో నాయికావర్ణన సందర్భంలో అంగాంగవర్ణన ఒకటి ఆచారంగా నిలిచిపోయింది. దానికందరూ తలొగ్గిన వారేకాని అలంకారశాస్త్రం ప్రసాదించిన ఉపమానసామగ్రిని విమర్శన దృష్టిలో ఉపయోగించుకున్నవారరుదు.

శ్రీనాథుడు, పినవీరన, పోతన, భట్టుమూర్తి, చేమకూర, శేషం, సారంగు, కంకంటివంటికొందరికి తప్ప తక్కినవారికా దృష్టి ఉన్నట్లుతోచదు. నన్నెచోడుడు కుమారసంభవంలో పద్యనామాలతో ముద్రాలంకారాలు సృజించి కవిత్వంపై తనముద్రవేసినా కావ్యనాయికలనామాలను గుఱించి అతడాలోచించకపోవటం విచిత్రం; కాబట్టి నామౌచిత్యానిబట్టి తెలుగు కవులు చేసిన కొన్ని వర్ణనలీవ్యాసంలో చూపదలచాను.

పోతనగారికి భాగవతంలోరాక్షసులను మోహింపజేసిన సంధ్యాంగనను వర్ణింపవలసివచ్చింది. అతడామెను

గురు కుచ భార సంకుచి తావలగ్నంబు
  దనరారు నాకాశతలము గాగ
లలిత పల్లవ పాణితలమున బెంపొందు
  చెండు పతత్పతంగుండు గాగ
సలలిత నీల పేశల పృథు ధమ్మిల్ల
  బంధంబు ఘనతమఃపటలి గాగ
ప్రవిమలతర కాంత భావవిలోకన
  జాలంబు తారకా సమితి గాగ
గడగి మైపూత సాంధ్యరాగంబు గాగ
అంగనాకృతి నొప్పు సంధ్యావధూటి —

అని సంధ్యావధూటికి పేరుకుతగినట్లు ఆకాశం, వ్రాలుతున్న సూర్యుడు, కమ్ముతున్నచీకటి, పొడుస్తున్న చుక్కలు, అలమిన సంధ్యారాగం ఉపమానాలుగా గ్రహించి చక్కగా రూపుకట్టించాడు.

పోతనగారు చేసిన ఈ చమత్కారాన్నిచూచి సింగరాచార్యుడు బిల్హణీయంలో యామినీపూర్ణతిలకను, కంకంటి పాపరాజుత్తరరామాయణంలో హేతిభార్యయగు సంధ్యను, ఇంకా ఉదయనోదయంలో యామవతిని, ఉషాపరిణయంలో ఉషను ఆయాకవు లీపద్ధతినే గ్రహించివర్ణించారు.

ప్రబంధయుగంవాడైన తెనాలికి పాండురంగమహత్వంలో ఓ చిలుకను పెంచిన వేశ్యను చెప్పవలసివచ్చింది. అతడు

కలహంసోపమయాన, చక్రకుచ, ప్రేం
  ఖత్ఖంజరీటాక్షి, కో
కిలసారస్వర బర్హచికురన్ కీరప్రియాలాప–

అని ఆమెను చెప్పి చిలుక ఆమెలో పోల్పొత్తులలో హత్తి ఉండటానికి సజావైనకారణాన్ని కల్పించాడు. ఈకథలో తెనాలి ఆమెపేరెక్కడాచెప్పలేదుగాని ఆమెను మనం 'పిట్టవ్వ' - నాగరికంగా అనుకుంటే శకుంతల అని భావించవచ్చు.

కావ్యనాయికలను నామౌచిత్యాన్ని బట్టి చేసిన ఈలాటివర్ణనలు రాయలయుగంలోకంటె తంజావూరుయుగంలో ఎక్కువగా వచ్చాయి. ఆయుగానికి మకుటాయమానం చేమకూర. అతడు సుభద్రను సుభద్రగాకాక,

కన్నులుదీర్ఘముల్, నగుమొ
  గంబు తలకట్టు, తమ్మిపూ
పున్నమ చందమామలకు
  పొక్కిలిచక్కదనంబు చెప్పగా
నున్నదె, మేలిబంతులుప
  యోధరముల్, మరికానునున్నయా
నెన్నికకెక్క వ్రాతఫల
  మివ్వరవర్ణినికిన్ నిజంబుగన్

అని ఆమెను వరవర్ణినిగా రూపించాడు. వరవర్ణినికి – వర్ణింపదగినవన్నెగలది, వర్ణింపదగినవారిలో శ్రేష్ఠమైనది, వరునిచే వర్ణింపదగినది అని ఎన్ని అర్థాలుచెప్పినా వర్ణధర్మంచెడకుండానే బయటపెట్టాడు.

ఈ యుగంలోని కవులు ప్రతిభలో ఎవరికెవరూ తీసిపోరు. చూడండి ఈ యుగాని కల్లాముద్దయిన ముద్దుపళని

రహిముద్దుపదములు రాజీవముల గేర
  ప్రపదముల్ తాబేటి వగల బోర
సరసోరు కాండముల్ సౌకర్యమేపార
  లేగౌనుసింగంపు లీలజీర
జన వళుల్ త్రిక్రమీ సౌజన్యమున దేర
  భుజము లారామతా స్ఫూర్తిమీర
రమణీయ ముఖకాంతి రామచంద్రునిజేర
  చిరునవ్వు బలు తెల్వి గరిమ గోర
కన్నుగవ శ్రుతిలంఘియై కలిమిగులుక
దనరు మధురాధరము కల్కితనము జిల్క
జెలగు శుకవాణి రుక్మిణీజలజపాణి
భావభవుమాత సంపదలీవుగాత !

అని రాధికాసాంత్వనంలో రుక్మిణీదేవిని స్తుతించింది. అయితే రుక్మిణి శ్రీకృష్ణుని భార్య గనుక పద్యంలో అవతారాలు బలరామునివరకే గ్రహించి బుద్ధకల్కికి పేరులు తడవకుంటే పద్యం మరింత ఔచిత్యం గల్గిఉండేది.

ఈమెను చూచి సింగాచార్యుడు బిల్హణీయంలో, పాపరాజుత్తరరామాయణంలో, ఈలాటిపద్యాలు వ్రాశారు.

ముద్దుపళని సమకాలికుల్లో సముఖం వెంకట కృష్ణపనాయకుడొకడు. అతడహల్యాసంక్రందనంలో సీతాప్రసక్తి వచ్చి

చిన్నపదముల హలరేఖచేత సీత
డీలుపడు కౌనుచేత విదేహజాత
గోముమీరిక కటిచేత భూమిపుత్రి
అనగ విలసిల్లు నయ్యింతి యతను దంతి.

అని సీత నామెకు గల విదేహజాత, భూమిపుత్రి అనే పర్యాయాలతో సాన్యతో దర్శనీయంగా వర్ణించాడు. ఈ కవికే సీతకన్న మొదలు రంభాదులనుతి

గుతించి చెప్పవలసివచ్చింది వారి రూపు రేఖ లెట్టివో మనమింతవర కెరుగం. కాని ఈతడు పేరు వినగానే

రంభయొన్న గజడ ప్రాయయూర్వసినల్పు
జీవంబు లేనిది చిత్రరేఖ
వామన పొట్టిది వక్రాంగి శశిరేఖ
హరిణి యటంటిమా యడవి మెకము
గాను గరోల్ చాతు గన నత్తిలోత్తమ
పగలు జూచిన చో నభాస తార
ధాన్యమాలిని మోము దర్శించిన ఖరంబు
పాండు వుమేనిది పుండరీక
నాగకన్య లటంటిమానడలు కుంటు
కుక్క దారల చందంబు తలప నేల
ముజ్జగంబులలో నున్న ముదితలందు
వొచ్చె మొకయింత లేనిది యొకతె లేదు.

అని వస్తుతత్వాన్ని ఒక్కొక్క ముక్కలో తేల్చివేసి వారిని వెళాకోళం పట్టించాడు. సముఖం సంక్షేపప్రియుడు గాని అంద రట్లు గాదు. కంకంటిపరాజు సుకేశుని భార్యయగు దేవవతిని

వేణికా రుచి కృష్ణ విభవంబు వహియించి
ముఖదీప్తి పూర్ణసోముని గ్రహించి
తనుకాంతి కనకగర్భనిరూఢి ప్రాపించి
స్తనలీల గిరిజాత ఘనత గాంచి
వరనాభిగతి దేవవల్లభోన్నతి మించి
మధ్యరీతి ననంగమహిమ జెంది
కటితటిస్ఫురణ చక్రహితాభ్యుదయమూని
నడలచే శిఖివాహ నటన మూని
సౌరభంబున సుమనఃప్రసక్తి మీరి
అఖిలసుమనోగణంబుల నతిశయించి
దేవవతి యన దనకన్య దెచ్చి యిచ్చె—

అని ఆమెకు కృష్ణుని, చంద్రుని, బ్రహ్మను, పార్వతిని పెద్దలైన దేవతల నుపమానంగా గ్రహించి వనితనాన్ని ప్రదర్శించాడు.

ఇక రెంటూరి రంగరాజు భానుమతీ పరిణయంలో

గతు లింపారగ ధార్తరాష్ట్రగరిమన్
గాంగేయకుంభోద్భవ
ప్రతిభన్ సిబ్బెపుగబ్బిగుబ్బలమరన్
బల్కన్ను లాకర్ణరం
జితశీలన్ దగ నర్జునద్యుతులచే జెన్నారు
లేనవ్వు భా
రతమున్ బోలి వధూవతంసము—

అని భానుమతిని భారతపాత్రలతో రూపించి మరో నూతన సంప్రదాయా న్నావిష్కరించాడు. భానుమతి భారతంలో ద్రౌపదికి సమఉజ్జీ పాత్ర గాబట్టి ఆమె నందలిపాత్రలలో చెప్పటం ఎంతేని సముచితం.

భర్తృహరితన సుభాషితాల్లో స్త్రీ ప్రశంసాగర్హణసందర్భాల్లో ఈలాటి చిత్రాలు కొన్ని ప్రదర్శించాడు. ప్రశంసా సందర్భంలో

మిగులశశికాంతమైన నెమ్మొగముచేత
నెఱి మహానీల రుచులైన కురులచేత
జలజరాగములైన హస్తములచేత
రత్నమయ మన కామినీ రత్నమమరె!

అని స్త్రీని రత్నంగాను గర్హణ సందర్భంలో

గురువగు కుచభారంబును
సరసకళా భాస్వదాస్య చంద్రుండు శనై
శ్చరము లగు చరణములు గల
కరిగమన దనర్చు నౌర గ్రహరూపమునన్.

అని స్త్రీని గ్రహంగాను రూపించటం అందులకు నిదర్శనం. ఈ అనువాదాలు ఏనుగు లక్ష్మణకవివి.

ఈలాటి చిత్రాలకు వీరందరికి తరువాతివాడైన అయ్యలరాజు నారాయణామాత్యుడు చెప్పదగినవాడు. నామా చిత్యాలు గాకున్నా అతడీలాటి చిత్రాలు చాలా చేశాడు.

కవి కేవలం ఈలాటి చిత్రాలపైనే మోజుపడినపు డందులో పాండిత్యం తప్ప ప్రతిభ కనిపించదు గాని ప్రతిభావంతుల చేతిలో పడినప్పుడు మాత్రం ఈలాటి కూర్పు కావ్యానికి మరింత శోభను చేకూరుస్తుంది. ప్రబంధకవు లీరహస్యాన్ని అందరూ కాకున్నా కొందరైనా గుర్తించారు గాబట్టే వారి కావ్యాల్లో ఈలాటి వర్ణన లక్కడక్కడ మెఱుపుల్లా కనిపిస్తాయి.

ఈ దృష్టితో మన ప్రబంధాలను పరిశీలించినా డీలాటివిశేషాలు మరింకెన్నో తెలిసిరాగలవు. ఈపర్యాయం మరోవిధమైన చిత్రాన్ని మీకు చూపిస్తాను. *

—* గురుభక్తి *—

శ్రీపరమేశ్వర స్వరూపులు, గురువర్యులు నైన కీ॥ శే॥ శ్రీ మల్లంపల్లి వీరేశ్వర శర్మగారి జన్మదిన సందర్భముగా (మహానవమి). శిష్యబృందముచే సమర్పింపబడిన శ్లోక కుసుమాంజలి.

1. యోఽపూజయత్ సర్వకవీన్
కవిభిర్యశ్చ పూజ్యతే
తమారాధ్య గురుం శాంతం
వీరేశ్వర మహంభజే

2. ఊర్వశీకాంక్షిత శ్చాపి
యోభవే న్నిర్జితేంద్రియః
మనస్సంధ్యాత గౌరీశం
వీరేశ్వర మహం భజే

3. శ్రీసూర్యకాంత కవితా
భానుసంతతి రాజితం
సంతోషిత సుహృద్బంధుం
వీరేశ్వర మహం భజే.

4. వృద్ధభక్తిః శిష్యరక్తిః
యేన ద్వే ధనభావితే
మునిపుంగవ చిత్తాఢ్యం
వీరేశ్వర మహం మహం భజే

5. కవితాదేహ జీవంతం
పుణ్యకీర్తి విభావితం
విద్యార్థి చాతకాంభోదం
వీరేశ్వర మహం భజే

6. ప్రాప్తగౌరీశ కారుణ్యం
మాన్యమానిత మానసం
సమానం సుఖదుఃఖేషు
వీరేశ్వర మహం భజే.

7. పండితం పరమోదాత్తం
పితరం త్యాగశాలినం
కవితా ప్రీణితోమేశం
వీరేశ్వర మహం భజే.
8 శివాంకిత మహాభక్తం
పిత్రాపుత్రి విభావితం
కులీనం పండితం ధన్యం
వీరేశ్వర మహం భజే.
9 విద్యా దాన సమాయత్త
సౌహార్దం ఛాత్ర సంతతౌ
పవిత్రాణార్హ నియమం
వీరేశ్వర మహం భజే.
10. కవితా శ్రీకోటిగుణ
ప్రవర్ధిత గురూన్నతిం
మహావ్రతం సుచరితం
వీరేశ్వర మహం భజే.

భక్తిపురస్సరముగా,
విద్యార్థి (శిష్య) బృందము.
పాలకొల్లు.

## లేఖ

సమాలోచన సంపాదకులకు
నమస్సులతో,

సోదరులు "భారతీప్రియ" గారు 1-10-78 సమాలోచనలో వ్రాసిన 'మన ఆడవారి నడకలు' అన్న పరమార్థ బోధక వ్యాసం చదివాను. గజయాన హంసయాన అన్ని పదాలకు తత్త్వార్థాలను ఆయన చాల సరసంగా వివరించాడు.

గజము అంటే గమన మనీ, హంస అనేది ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నడిపే హంస మంత్ర మనీ మరిచిపోతున్న మన సంప్రదాయాన్ని మళ్ళీ మనకు గుర్తుచేసారాయన.

కాని పరిశీలించి చూస్తే మరోసత్యం కూడా బోధపడుతుంది. ఈ రెండు విశేషణాలు ఆడవారి పరంగా గాక అమ్మవారిపరంగా (పరాప్రకృతి) మనసంప్రదాయంలో మొదట వాడబడ్డాయి. వేద ఋషులు, ఋషులైన కవులూ అమ్మవారి

( తరువాయి 24 వ పేజీలో )

# ప్రాకృత గాథలు

- శ్రీ డా. అయ్యగారి నరసింహామూర్తి, ఎం.ఏ., పిహెచ్.డి.

గడపయందు పాదమిడుచు నెనుదిరిగి
దారిగాంచి ఘటము జార విడిచి
'హారొయిహారొయి' ననుచు బోరన నేడ్చెను
అరయగలవె చెలియ! తరుణి యుక్తి.
ప్రస్తరాధికమైన ఈ పల్లెయందు
పండుకొన చాపలే లేవు బాటసారి
ఉన్నతపయోధరాల్గాంచి యుత్సహించి
ఉండదలంచితి వే నిట నుండిపొమ్ము.
పల్లెయందె పుట్టి పల్లెలో బెరిగితి
నగర జీవనంబు నాకు లేదు
అయిననేమి నగర దయితుల నెల్లరన్
చక్కదనముచేత చొక్కజేతు.
విటునిజూచినంత వేపితో కాడించి
ఇంటికాపు గనిన నెగిరి మొఱుగు
నట్లు తీర్చి దిద్ద నసతి మేపు లొసగి
బుద్ధిచేత గాని దిద్ది లేదు.
అత్త యూరుపోవ నారాటపడ నేల
శంక లేక చెలియ సాగిపొమ్ము
తొర్పగ త్తైలరయు తరుల తొకుంజముల్
గలవు ఇష్టసిద్ధి గలుగునమ్మ!
తేలుకుట్టె ననుచు గోల పెట్టగ నామె
జాణలైన చెలులు చతురబుద్ధి
మగడు చూచుచుండ నగుచుచు మగువతో
జారవైద్య గృహము చేరినారు.
వలపు తోడుత రమణిని వాడుచూడ
చూడ్కిదోయిని పంపెను సుందరాంగి
వలపుతూపులు; ఒకచోట బలసి కొనగ
రతి సుఖంబున తేలిరి రాణమీఱ
ఇంటి బరువునంత నెత్తె నామీదకు
మెత్తదనము లేని దత్తగారు
సంజవేళ గూడ శ్రాంతి యుండునో లేదో
వలనుపడదు నాకు తెలియజేయ.
వేడిమికి తాళజాలక నీడకూడ
శిశిర తలభూమి నారసి స్వేచ్ఛగాను
విశ్రమించెను పథికుడ? వేని కొఱకు
కదలనుంకించుచున్నావు గాడ్పు తగ్గ
దనుక విశ్రాంతి గొనుమయ్య దర్ప ముడిగి

# వేదాలు పౌరుషేయాలా?

'భాషాప్రవీణ' శ్రీ మైలవరపు శ్రీనివాసరావు, ఎం. ఏ.

నేడు గోచరిస్తున్న, సకల ప్రక్రియలకూ, మంత్రభాగాలకీ మూలంగా ఉన్న వేదాలు పౌరుషేయాలా? (ఎవరో మానవమాత్రులచేత వ్రాయఁడినవా?) లేక దైవదత్తాలా? అనే వివాదం చాల కాలంగా ఉంది. ప్రాచీనులూ - సంప్రదాయధోరణిలో అభ్యాసంచేసి, సంప్రదాయాన్ని అభిమానించే పండితులంతా, 'దైవదత్తాలు కాక, మానవులు అంతటి వైశిష్ట్యం ఉండేలా వ్రాయఁగలరా? ఊహామాత్రానికైనా విషయం గోచరిస్తుందా?' అంటారు. నవీనులూ, వేద ప్రామాణ్యాన్ని పూర్తిగా నిరసించేవారంతా, ఎవరో ఈకాలానికి సంబంధించిన వారు వ్రాయక, దేవుడే వ్రాసిఇచ్చాడంటే ఏమాత్రమూ నమ్మమని అంటారు. ఈ వింత ఈ క్రొత్తగా పెరుగుతూన్న నాగరికత (అనుకుంటున్నారు) వల్లవచ్చిపడుతోంది. అందుచేత వారికి నచ్చేవిధంలోనే వారికి సమాధానం చెప్పి వేదాలు అపౌరుషేయాలే (అంటే మానవమాత్రులు వ్రాసినవి కావు) అని నిరూపించదలఁచిన వ్యాసం ఇది. దీనిఁగూర్చి ఎంతో వ్రాయవలసిఉన్నా సంక్షేపించి నిరూపిస్తాను.

ఒక గురువు తన శిష్యుడికీ, ఆ శిష్యుఁడు తన శిష్యుడికీ నోట చెప్పి వల్లింపఁజేయగా ఇలా పరంపరగావచ్చింది వేదం అంటారు స్థూలంగా ప్రాచీనులు. అలా ముందుముందుకు సాగి చూస్తే ఒక దేవుడు గురువు, మరొక దైవతాంశ శిష్యుడూ అవుతారు. ఆ దేవుడీయగా ఈ శిష్యుడు వేదాలని స్వీకరించి తర్వాతివారి కందిస్తూవచ్చాడు నేటి కాలంలో ఆస్తులలాగా. కొంతకాలం అయి తెలివి పెరిగాక అక్షరలేఖనాదులు వచ్చాక వ్రాయడం జరిగింది - అంత మాత్రాన వేదాలు ఎవరిచేత వ్రాయబడ్డాయో వారే గ్రంథకర్తలౌతారా? (అదే నిజమైతే ప్రెస్‌ప్రింటర్స్ కంటే వేరే గ్రంథకర్తలే ఉండరు) అని ప్రాచీనులు.

నవీన పద్ధతిలో, వేదాలు అనాది కాలంనించీ వస్తూన్నవని నిరూపించాలి. అది గదా ప్రస్తుతం. ఒక రేడియో స్టేషన్ని ఉదాహరణగా తీసుకుందాం. ఆ రేడియో స్టేషన్ ఎన్నో శబ్దాల్ని అలా ఉచ్చరిస్తూంటే వదులుతోంది. అవి తమని గ్రహించగలిగే రేడియోలున్నచోట resist చేయబడి transmit చేయబడుతున్నాయి. (ఇలా resist చేసి transmit చేస్తాయి కాబట్టేగదా వాటిని 'Transmitresistors' - Transistors అంటున్నాం. మళ్ళీ మాట్లాడితే ముందుపదం ఇలా మారడంలో మా ప్రత్యాహార పద్ధతి కూడా ఉంది). ఆ రేడియో స్టేషన్ ప్రసారాన్ని సమాప్తిచేస్తే మనరేడియోకూడా ఆటోమేటిక్‌గా సమాప్తి అయిందన్నమాటే. రేడియో tune చేయబడి ఉంటే, మళ్ళీ రేడియోస్టేషన్ ప్రసారాన్ని ప్రారంభిస్తే, ఇది automatic గా ప్రసారాన్ని ప్రారంభిస్తుంది. ఇంతవరకూ, ఈ సైన్స్ వారు కనుక్కున్నా మనుకున్నారు. ఈ విషయం ఇంతకుముందేఉంది. బ్రహ్మగారు తన నాల్గు ముఖాలతో అనవరతం వేదాలని పారాయణం చేస్తూనే ఉన్నాడు. అంటే ప్రసారాన్ని నిలుపుదలలేక కొనసాగిస్తున్నాడు. ఆయన శబ్దాల్ని ప్రసారంచేస్తూంటే ఆదివ్యవాక్కుల్ని resist చేసి తమలోనించి transmit చేసికోగల్గిన మహానుభావులు మహర్షులు. వీళ్ళు receiving sets అన్నమాట. ఆ వేదశబ్దతరంగాల్ని అలా అక్షరం పొల్లుపోకుండా (ఈనాటి రేడియోలలోలాగా) సస్వరంగా గ్రహించ గల్గినవారు మహర్షులు. ఎందుచేత? అంటే - రేడియోలో కూడా particular station అన్ని Kelocycles మీద అన్ని మీటర్లలో tune చేస్తే తప్ప ఆస్టేషన్ ప్రసారాలు ఎలారావో, అలాగే ఈమహర్షులు కూడా తమతమ ఆత్మలని particular దేవు గూర్చి Particular ways లో (ఆయా చెప్పబడిన సమాధిపద్ధతులలో) tune చేసుకుని ఉంచుకున్నారు. అందుచేత ఆ బ్రహ్మ ఏం పలికినా అది వీరి ఆత్మలలో అలా పలికితీరుతుంది. మామూల మనుష్యులకి ఎందుకు వినిపించదు? అంటే ఇదే కారణం. మామూలు మనుష్యుల తమతమ ఆత్మలని అలా particula దేవునిగూర్చిన particular way లో tune చేసుకునే శక్తి కలవార కారు. వాళ్ళకి Concentratio లేదు. పూర్తి ఏకాగ్రత ఉన్నది మహర్షులకే. అందుకే వారికి మాత్ర వే గోచరించింది వేదవాక్కు. ఏ మాత్ర

( 23 వ పేజీ తరువాయి )

పరంగా ఈ విశేషణాలు వాడుతు వచ్చారు. తరువాతి కవులు కొందరు స ప్రదాయం తెలిసి, కొందరు అలవాట ప్రకారం, ఈపదాలువాడేశారు. మొద అమ్మవారి పరంగా తరువాత ఆడవారి రంగా విశేషణాలు వాడబడ్డాయి. కను ఈవిశేషణాలు బాహ్యార్థంలో ఆడవా నడకలనూ, అంతరార్థంలో అమ్మవా నడకనూ, స్ఫురింప జేస్తాయి. ఈవివర కూడ ఈసందర్భంలో అవసరంగ భావించి తెలియజేస్తున్నాను.

ఇట్లు

మోపిదేవి కృష్ణస్వామి ఎం.

విశాఖ.

తమ ఆత్మ ఒకింత తొలగినా వేదవాక్కు వినపడదు. రేడియోలోనూ అంతే. ఆ స్టేషన్లను సూచించే 'సూచిని' ఏమాత్రం ప్రక్కకి తొలగినా ఆ స్టేషన్ నించి వచ్చే శబ్దతరంగాలు వినపడవు సరికదా ఏవో కూతలు-రాకాసి ధ్వనులూ వస్తాయి. ఆ range లో మామూలు మనుష్యులుంటారు. అందుకనే వేదాలు, Concentration లేకపోతే, పరిశీలనా దృష్టి లేకపోతే ఏదో నిరర్థకధ్వనుల్లా కొందరికి విన్పిస్తాయి. అర్థంలేని వెర్రివెర్రి సంగీతాలు ప్రపంచానికంతా రొదలౌతున్నా, శ్రవణపేయంగా వారికి అన్పిస్తాయి. అంటే వారి ఆత్మ ఆ Kelocycles లో అలా tune అయి ఆ వెర్రిస్టేషన్‌కి Concentrate చేస్తోందన్నమాట. 'లోకో భిన్నరుచిః' కదా !

ఇలా మహర్షులు నిరంతరం తమతమ మనస్సులని అలా concentrate చేసి నిత్యం వేదపారాయణాన్ని వింటూండడం వల్ల వాళ్ళకి ఆ వేదం పూర్తిగా కంఠస్థీకృతమైంది. రోజూ ఆ వేదాల్నే వినడం విసుగనిపించదూ ? అని నవీనుల ప్రశ్న. (ఒకే రకం పాటలని రోజూ వింటూ టైం సరిపోవడంలేదని ఈకాలంలో గొడవ చేయడంలేదా ?-అలాగే) ఆ రోజుల్లో ఆ వేదాలు వారికంత ఆనందాన్నిచ్చాయి. కొంతకాలానికి వాటిని గ్రంథాలలో లేఖనరూపంలో ఉంచారు. అంతే కాని వేదాలు దైవదత్తాలే. దైవోచ్ఛరితాలే. ఉచ్ఛార్యమాణాలే. మనమూ అలా ఏకాగ్ర బుద్ధిని ఉంచితే ఇప్పుడుకాదు-ఎప్పుడూ వినిపిస్తాయి 'వేదవాక్కులు' శబ్దం నిత్యమని కదా-దానికి ఆటంకమా ? లేదు.

కాబట్టి ఈరోజులలోని వాటినిచూచి ఆకాలంనాటి వాటిని విమర్శించడం ఎంత మాత్రం సముచితం కాదు.

---

డా॥ నారపరాజు శ్రీధరరాయకవి
(M.B B.S. D.T.M. చీరాల)
ఐహాకరణము - 1989.

# సుఖ సేవధి

— శ్రీ చల్లా నరసింహారావు

* నేలయు గాలి నిప్పు మఱి నీరును సృష్టిని నాల్గు; భూత సం
జాలము; జీవితమ్ములకు సాయము సేయుచునుండు నవ్వి యే
వేళను; నింగి వానిజత వేరయి లెక్కకు నంద; దెందుకో ?;
నీలపు శూన్యమద్ది; కననేరము దాకినదాని నిత్యమున్.

* మనుజుని రూపమున్ శిలకు మల్చి సుమాలను పైనిఁబోసి నే
లనుబడి వేచినన్ గలుఁగు లాభము గానఁగలేవుగాని ముం
దునకుఁ బడంగ గుబ్బలకు దుమ్ముగుటల్ గనిపించు నీకు; మా
నిని నన లీవు గోసికొని నిల్పుము గొప్పున; హాయి యే మిడున్.

* పనితనమంతసూపి సుమవల్లరు లల్లిక సెక్కినట్టి కాం
చన చషకమ్ము నిండఁగ హుసారుగ వారుణిపోసి తెమ్ము; చీ
రను మునిప్రేళ్ళఁ బైకిఁగొని; రాతిరి బొత్తిగ త్రాగలేదు; పో
యిన దిన మెట్లు వచ్చు; సఖి ! యేగెను నిన్న ముదమ్ము వ్యర్థమై !

* సురనాథుం డొకఁ డేలుచుండె దివి సుశ్లోకంబుగావన్న; న
ప్సరసల్ శీధువు నిష్టమైనటుల సంభావించికాదే యతం
డురు కీర్తిన్ విలసిల్లెఁ; జచ్చియటుపో నుజ్ఞాత లవ్వానికం
దుర ? యారెండును లేవె యిచ్చటనె; యీ దుర్బోధ మింకేటికో

* మొహమలు దిండునాకొనుని ముచ్చట తొంగిలఁ గూరుచుందు; నీ
సహజపు గొంతుతో ముదిత చల్లఁగఁ బాడుము; నేను విందు; నీ
మహిపయి నన్నుబోలరు సుమా ప్రభులైనను, నిక్కమద్ది; యి
య్యిహమున జీవరాజ్యరమ నేలెద !; స్వర్గసుఖంబు లెక్కడే !



# అన్యదేశ్యములు

- శ్రీ యస్. రాజశేఖర్, బి. ఏ. (రత్నశ్రీ)



ఏభాషయందైనను పదజాలము నిసర్గము (Indigenous), ప్రతిదేయము (Borrowed) అని రెండు విధములుగా విభజింపవచ్చును. మూలభాష నుండి పైతృకముగా సంక్రమించిన పదములు నిసర్గము లనియు, తదితరములు ప్రతి దేయములనియు ననబడును. పరిసర స్థలములగు సజాతీయ సోదరభాషల (Cognate languages) నుండి గాని, సమీప వర్తివిజాతీయభాషలనుండి గాని, మతవాణిజ్యరాజకీయాది సంవర్గ సంబంధ మూలమున దూరవర్తి విజాతీయ భాషలనుండిగాని, ఎరువుతెచ్చిన పదములు ప్రతిదేయములు. దీన్నిబట్టి పైతృకము దేశీయమనియు, ప్రతిదేయము అన్యదేశ్య మనియు నిర్ధారింపవచ్చును.

అన్యదేశ్యములవిషయంలో మనవ్యాకరణ కర్తల విషయ విభాగ నిర్ణయమున ఏకాభిప్రాయములేదు. ఆంధ్ర భాషయందు ముఖ్యముగా 4 విధముల పదము లున్నవి. 1 తత్సమములు 2 తద్భవములు 3 (స్వ) దేశ్యములు 4 అన్యదేశ్యములు.

1 తత్సమములు :- విభక్తిప్రత్యయము మారి, తెనుగున వాడబడుచున్న సంస్కృత ప్రాకృతపదములు తత్సమములు.

ఉదా:- (సం) గురుః = గురువు. ప్రా. గారవ (ం)=గారవము

2 తద్భవములు:- వర్ణాగమ, వర్ణలోప, వర్ణాదేశములలోనుగాగల వికారములను విధివిహితముగాఁబొంది తెలుగున వ్యవహరింపబడు సంస్కృత ప్రాకృతపదములు.

3 దేశ్యములు :- తెలుగు దేశమునకు అనాదినుండి సొంతమైనవై యుండి, భాషలనుండివచ్చి కలిసినపదములుగాక, పూర్వము నుండి వాడబడుచున్న పదములు, ఆ దేశమునకు (స్వ) దేశ్యములు.

ఉదా॥ అరవ, ఊరు, తల్లి, మొదలైనవి.

4 అన్యదేశ్యములు :- ఇతర దేశముల తోడి సంపర్కవశమున, వారి భాషల నుండి తెలుగు భాషలోనికి వచ్చి తెలుగు పదములుగా, వాడబడు చున్నపదములు అన్యదేశ్యములు.

ఉదా॥ కవర, పెన్సిలు, తాపు, ఢాకా, టిక్కట్టు, నాజూకు, తమాషా, తబలా, తాయెత్తు మొదలైనవి.

అన్యదేశ్యములనగా ఇతరదేశ భాషల నుండిగాని, దేశంలోని ఇతర ప్రాంతాల నుండిగాని, ఆభాషతో కలిసి వాడబడు చున్నపదములు. అన్యదేశ్యముల నిర్వచనములు పరిశీలించిన పండితులలో ఏకాభిప్రాయంలేదని స్పష్టమగును.

అన్యదేశ్యములను గూర్చి తెల్సుకొనుటకు ముందు కొన్ని భాషాశాస్త్రవిషయములు తెలిసికొనవలెను.

(1) అరవ, కన్నడ, మలయాళములును, తెలుగును ఒక్క భాషామండలికములని భాషావాదులు నిరూపించిరి.

(5) తెలుగులోనికి సంస్కృత సమములు - సంస్కృతభవములు—

ప్రాకృతసమములు, ప్రాకృతభవములును అనేకములు వచ్చినవనుటను వైయాకరణులందరు ఏకగ్రీవముగాఅంగీకరించిరి.

(3) సంస్కృత, ప్రాకృతముల వికృతియే "తెలుగని" ప్రాచీనులు పేర్కొన్నారు.

(4) మనదేశములో వ్యవహృతములౌతున్న భాషలను స్థూలంగా ఉత్తరదేశ భాషలనీ, దక్షిణదేశభాషలనీ విభజింపవచ్చును. భాషాతత్త్వవేత్తలు ఉత్తరదేశ భాషలను ఆర్యభాషలనీ,దక్షిణదేశభాషలను ద్రావిడభాషలనీ వ్యవహరిస్తారు.

(5) ఈనాడు తెలుగు, తమిళములు ప్రత్యేక భాషలుగా వ్యవహృతములగుచున్నా, అతిప్రాచీనకాలంలో ఇవన్నీ కలిసి మెలసి ఉండేవి. కాలక్రమాన అవి విడిపోయి, వేర్వేరు భాషలుగా వాడుకలోకి వచ్చినవి. వీటన్నిటికి "మూల ద్రావిడభాష" లేక 'ప్రాచీన ద్రావిడ భాష' మాతృక అని పండితులు విశ్వసిస్తున్నారు.

అన్యదేశ్యములు అన్ని భాషలయందు ఉంటాయనడంలో ఆశ్చర్యములేదు.

అన్యదేశ్యములు రావడానికి కారణాలు :-

(1) ఏభాషయందైనను అన్యదేశ్యము లేర్పడుటకు, ఆయాభాషలు మాట్లాడు వ్యక్తులు, సంఘములు కలిసి మిక్కిలి సన్నిహితముగా ఎక్కువకాల ముండుట.

(2) వర్తకం నిమిత్తము ఒకదేశము వారు ఇంకొకదేశమునకు వెళ్ళుట, ఒక ప్రాంతంవారు ఇంకొక ప్రాంతం (వేరు భాష ఉన్నప్రాంతం) లోనికి వెళ్ళుట, వలసలు వెళ్ళుట. వేర్వేరు ప్రాంతాల్లో నివాస ముండుట.

(3) పరిపాలకులు దేశ భాషనుగాక వేరొకభాషను రాజభాషగా స్వీకరించుట,

(4) ఒకదేశమందలి భాషాపదములు ఆదేశమునకు సమీపమునున్న దేశభాష లోనికి ముందుగా వ్యాపించి, అట్లాగే గాని కొద్దిమార్పులతోగాని వేఱొకభాష లోనికి చేరుటకలదు.

మన తెలుగుభాషయందు ప్రవేశించిన అన్యదేశ్యములు :- మనదేశమును కొన్ని వందలసంవత్సరములనుండి నిన్న మొన్నటి వరకు (1947 ఆగస్టు 15) అనేక చక్ర

వర్తులు, విదేశీప్రభువులు పరిపాలించిరి. వివిధ సంస్కృతులు, వివిధ భాషలు గల అనేకులు మనదేశముపై దండెత్తివచ్చి ఇచ్చట స్థిరపడిరి. హిందూస్త్రీలను వివాహమాడిరి. వారిమతాన్ని సంస్కృతిని, భాషను, హిందూదేశంలో వ్యాప్తి చేశారు. అరబ్బులు, బ్రిటిషువారు డచ్చివారు, ఫ్రెంచివారు, మొగలులు, పోర్చుగీసువారు, గ్రీకులు మొదలైనవారనేకులు ఇచ్చట వారి సంస్కృతి భాషలను వ్యాప్తి చేశారు. మనవేష భాషలందు, సంస్కృతియందు వారిప్రభావం పడి అనేక మార్పులు సంభవించాయి. ధరించే దుస్తుల్లో, భాషించేభాషలో, ప్రవర్తించే తీరులో విదేశీయుల (ముఖ్యంగా బ్రిటిషువారి) ప్రభావం ఎక్కువగా ప్రస్ఫుటంగా కనపడుతోంది. మనదేశం భిన్న సంస్కృతి, భాషలకు ఆలవాలమైంది. ప్రాచీనకాలంనుంచి అర్వాచీనకాలం వరకు అనేక సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక, రంగాలలో పెక్కుమార్పులు సంభవించాయి. తత్ఫలితంగా భాషలో కూడా మార్పులు వచ్చాయి. తెలుగులోనికి వచ్చిన అన్యదేశ్యములలో ముఖ్యమైనవి అరవ (తమిళం) కన్నడములు, పారశీ అరబ్బీ, హిందీ, ఉర్దూ, ఆంగ్లము, ఫ్రెంచి, పోర్చుగీసు, డచ్చి, మరాఠీ మొదలైనవి ముఖ్యమైనవి.

అన్యదేశ్యములు 2 రకాలుగా విభజింపవచ్చును. 1. రాజ్య వ్యవహారమున వచ్చినవి. 2. నిత్యవ్యవహారమున వచ్చినవి. తెలుగునకు, చుట్టుప్రక్కల మాట్లాడు భాషలు అరవము, కన్నడము, హిందీ, ఓఢ్రము అనునవి. ఇందు ఆయా ప్రాంతములనుండి జనులు రాకపోకలు జరుపుటవలన సరిహద్దు మండలములోని వారు రెండు మూడు భాషలయందును వ్యవహారము జరుపుచుండుటవలన ఆ పదములు వచ్చిచేరును.

1 అరవపదములు :- ఈ అరవపదములు తెలుగున చేరుట ఇప్పటివిషయము కాదు. క్రీ.శ. 1102 సం॥లో వీరచోడుని పిఠాపురపు తామ్రశాసనములలోనే అరవ పదములున్నవి. అరవపదములు తెలుగు శాసనములలో ప్రవేశించినవి. శైవసంప్రదాయమును నిరూపించు దక్షిణ కథావళులయందును, అరవపదములు తెలుగున వచ్చినవి. నేటి అరవవారు తెలుగుదేశమున ఫలాహారపుటంగళ్ళు (Hotels etc) మొదలైనవి పెట్టి ఆ పేళ్ళను తెలుగున ప్రవేశపెట్టిరి. శ్రీవేంకటేశ్వరులయు, కాళహస్తీశ్వరులయు క్షేత్రములను గూర్చిన కథలయందును, ప్రసంగములయందును ఈ అరవపదములు రాక తప్పవు.

ఈ క్రిందిపదములు కొన్ని ఉదాహరణములు.

తిరువారాధనము, తిరుచూర్ణము, తళిగ, మళిగ, నంబి, తంబి, పొరువిళంగాయి, తిరువామొళి, విరువామొళి ఆళ్వారు, నైనారు, సాంబారు, సాపాటు, నాంచారి, అలమేలుమంగ, కైంకర్యము, వడ, జియ్యరు, నంజ, పుంజ, తిరుమణి, సంబళము, అడియడు, మొదలైనవి. పై పదములలో కొన్ని సంస్కృతము నుండి యరవమున నేర్పడిన వికృతులు.

2 కన్నడపదములు :- కన్నడమునకు పైరీతిని, అనేకవిధములైన సంపర్కము తెలుగుతోగల దనుట నిర్వివాదము. శ్రీనాథుని కాలమునుండి, కన్నడపదములు పెక్కులు తెనుగులోమిళితమైనవి. ఉదాహరణ : అరసు, కెలసము, గండపెండియరము, నంగనాచి, హెగ్గడి, హొన్ను, దేవర, బేడలు, సాకు, పల్లె, రాయారు, బిడారు, హేమాహేమీలు, హెచ్చు, హోరాహోరీ, హాయి, మొదలైనవి అనేకములు కలవు.

3. అరబీ, పెర్షియను ఉర్దూ, హిందీ, ఆంగ్లభాషలతో సంబధం :- పైభాషల లోని అనేకపదములు మన తెలుగులో ఉండి, తెలుగుపదాలుగా చెలామణి అవుతున్నాయి. 11వ శతాబ్దంనుండి ముస్లింలు ఇండియాపై దండెత్తివచ్చి ఇక్కడ స్థిరపడిరి. అదేవిధంగా అరబ్బులు, పారశీకులు, మొదలైనవారువచ్చి ఇచ్చట స్త్రీలను వివాహమాడిరి. ఆ సంపర్కముతో అనేక క్రొత్తభాషలు ఉద్భవించి ఉండవచ్చును. ఉర్దూ అటువంటిదే అయివుండవచ్చును. ఉర్దూ అనగా మకాము లేక బసఅని అర్థము. మార్గమధ్యమున రాజులు చేసిన విడిదికి పేరు. దీన్ని బట్టియందు బయల్దేరినభాషకు 'ఉర్దూ' అని పేరు వచ్చింది.

1 రాజవ్యవహారములో వచ్చిన (అన్యదేశ్యములు) పదములు :- సిస్తు దస్తు, శిరస్తాదారు, ఇరసాలు నామా, కచేరి, దస్తావేజు, వకీలు, గుమాస్తా, ఖైదు, కిస్తీ, కొత్వాలు, వజీరు, దివాను, ఫసలీ, కిస్తీ, జమేదారు. అమలు, అర్జీ, సాయిబ్.

2 నిత్యవ్యవహారములోని పదములు :- మేజా, పాయిఖానా, తపేలా, తవాబీ, కూజా, చాకు, బిచానా.

పాశ్చాత్య భాషాపదాలు :- (ఆంగ్లేయులు, ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసువారు వాడినపదాలు.) అలమారు, బీరువా, అమార్, బొత్తాము, కమీజు, బాల్చీ, పరాసు, ఫిరంగి, కుసిని, కమాను మొదలైన ఫ్రెంచిపదాలు.

ఆంగ్లభవములు :- లాంతరు, రోడ్డు, స్కూలు, పోస్టు, మేస్టారు, ఇనస్పెక్టరు, పోలీసు, రిలీజు, రిజిస్టర్, పెట్రోలు, ఆయిలు, నంబరు, టిన్ను, డూటి, కోటు, బకెటు, షాపు, అరస్టు, వారంట్, లా, మొదలైనవి.

పోర్చుగీసు నుంచి వచ్చినవి :- అలమారు, అరిమాని (హార్మోనియం) ఇస్త్రీ, ఏలము, ఒలందా, కందీలు, కపితాను (కప్తాన్) కబ్బా, కానా, కాజా (బొత్తం పెట్టుకొనే కన్నం) పదేలు, పంపిని (కంఫిణి) కోపా, కోస్తా, కోసు, గబేళా (గమేళా) గొదాం, చపాతు (చప్పాతి) తువాల (తువ్వాలు) బిస్కత్తు, పరంజా, పాదిరి, మొదలైనవి.

మరాఠీపదములు:-అసల్ (అసలు) తెలుగు, ఖంకార్ (కంగారు) కాగద్ (కాగితం) ఖిచిడీ (కిచ్చిడి) చందన (చందనం) గంజా (గంజాయి) గస్త (గస్తు) ఘాగ్రా (గాగరా) ఘోంగ (గొంటడి, గొంగళి) శామల (చామలా) ఢమాయి, తబరా (తబల) తాలీజు (తాయెత్తు) కమరు (కవరు) కిరాణా, మొదలైనవి.

హిందీపదాలు :- అంబారీ, అత్తరు, అగాడీ, అమలుదారు, అరతావు, అర్జి, ఈనాము, ఉలుఫా, మిరాసీ, కంఖాణము, కచేరి, కనాతీ, కలమ్, కాగజ్ (చైనాభాషాపదం) కితాబు, కుర్చీ, కొజ్జా, కాలు, దస్తూరి, ఖర్చు, ఖరాబు, ఖాతీరు, ఖాతరు, ఖాయము, ఖాళీ, కామందు, సలామ్, గులామ్, గరీబు, నవాబు, గలబి, గలీబు, గమత్తు, గోరీ, ఘోషా, చందు, చాడీకోరు, చిత్తా, జబరదస్తీ, జవాఖర్చు, జెండా, టికాణా, టోపీ, జలతారు, జవాబు, సవాల్, జాలరు, జరీ, డేరా, డోలు, తతిమ్మా, తనఖా, తపాలా, తాఖీదు, తైనాతీ, తాజా, తాపితా, తుపాకీ, తురాయి, దర్బారు, దవతి, దుకాణం, ధోవతి, ధన్నా సరి, నకిషీ (నగిషీ) నగారా, నజరు, నజీబు, ఆసామీ (నఫరు) నాజూకు, నిఘా, నిశానీ, నిషా, నౌబత్తు, మొకమల్, మైదానం, బేరీజు, భేటీ, భేషు, బాకీ, బహద్దర్, పసంద్, సైతాను, ఫౌజుదారు, పరగణా, పైకం, ఫర్మానా, బందోబస్తు, పంక్తి మతలబ్, ముస్తాబు, ఖజానా, మొదలైనవెన్నో ఉన్నాయి.

తరచు మనంఉపయోగించే అన్యదేశ్యాలనుచూస్తేఆశ్చర్యం కల్గుతుంది. అవి తెలుగు పదాలుకాదంటేనమ్మలేకపోతాము. మనం నిత్యవ్యవహారంలో లేదంటే 40 శాతం ఈ అన్యదేశ్యా లుంటాయి. అలాంటివి కొన్ని :- హమేషా, తమాషా, ఖుషీ, షికారు, పసంద్, అలమారు, బీరువా, నాజూకు, ఫిరంగి, పిస్తోలు, ఇస్త్రీ, చపాతి, తువ్వాలు, గలభా, గమేళా చక్రకేళి, రంగులరాట్నం, పంపరపనసు, బత్తాయి, కాఫీ, టీ, అసలు, నమోదు, సమన్లు, పిటీషను, కాగితం, డాక్టరు, వకీలు, సాపాటు, సాంబారు, టికాణా జబ్బు, తావు, కిరాణాకొట్టు, చెవి, తిల్లిక, సవారి, స్వారీ, అపరంజి, వాహ్యాళి, కళావరు, సాని, హర్తాళ్, సమ్మె, కాకారాయుళ్ళు, ఉప్మా, మైను, రథం, కర్పూరం, మంజూషా, బొత్తం, ప్రయాణం, ప్రవాళం, కన్యాశుల్కం, పటారం. లొటారం, హిస్టరీ, మిథ్య, ముద్దాయీ, దువ్వెన, పనస, భీమా, బాల్చీ, సమ్మాన్, అణా, బాడీ, జింఖానా, మొదలైనవి.

మన తెలుగు ద్రావిడభాషా జన్యమై మొదటినుండియు సంస్కృత, ప్రాకృత భాషలతో పెనవేసుకొనిపోయి, పెరుగుటచేత తెలుగులో సంస్కృత, ప్రాకృతపదము లెన్నియో చేరి వ్యవహరింపబడుచున్నవి. నిఘంటువులనుండి అన్యదేశ్యములను వేరుచేయబోయినచో అన్యదేశ్యములే యెక్కువా యనిపించును. ఇట్టిస్థితి ప్రతిభాషకు సహజము, అనివార్యము.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెలుగు - ఇతరభాషలను గురించిచెపుతూ ఇలా అన్నారు. "దక్షిణహిందూ దేశ సమిష్టి దేశభాషావఘాటి పసి ప్రాయపు పలుకులు అరవము, ఎలప్రాయపు పలుకులు కన్నడము, నెఱుతనపు పలుకులు తెలుగు." డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారు సంస్కృతభాషయొక్క ప్రాశస్త్యాన్ని వర్ణిస్తూ ఇలా అంటారు.

"ప్రతి భారతీయ భాష మీద సంస్కృతి భాషాసాహిత్యాల ప్రభావం కొద్దిగానో, గొప్పగానో కనిపిస్తూ ఉంటుంది. *

ఈ వ్యాసరచనకు నన్ను ప్రోత్సహించిన శ్రీ బులుసు వెంకటేశ్వర్లు (ఫిజిక్సు లెక్చరర్), శ్రీ కొలచిన వెంకటరమణమూర్తి (తెలుగు లెక్చరర్) పాలకొల్లు గవర్నమెంట్ కాలేజిగార్లకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నారు.

## Reference Books
(పరిశీలించిన గ్రంథాలు)

(1) విద్వాన్ గంటిజోగి సోమయాజి - "ఆంధ్ర భాషా వికాసము"

(2) డా॥ చల్లారాధాకృష్ణశర్మ - "తెలుగు-దాక్షిణాత్య సాహిత్యాలు"

(3) వేటూరి ప్రభాకరశాస్త్రి - "తెలుగు మెరుగులు"

(4) తూమాటి దోణప్ప - "తెలుగులో కొత్తవెలుగు"

# పద్యానికి విలువ ఉన్నదా?

— శ్రీ ప్రసన్న

పద్యం అంటే బహుశః పదాత్ భవం అని కాని పదేభవం అని కాని అయివుండవచ్చును. ఏకవచనం జాతివాచకం అనుకోవాలి. అనుకోకపోతే ప్రమాదం లేదు. ఛందో - బందోబస్తులేనివీ పద్యాలు కావచ్చు. పూర్వపు పద్యాలు రాజపూజితాలు, రాజసమ్మతములు, రాజసఖములు, రాజపోషితములు, రాజలాలసములు, (మనోహరములు) బహుసమ్మతములు, కవిపండితామోదకములు, ప్రజాకర్షకములు, అయి చివరికి స్వాత్మమాత్రపరితోషకములో, స్వ పర భేదాది సమాశ్రితములో అయినాయి. చివరికి ఆత్మాశ్రయ కవిత్వం పరాశ్రయకవిత్వం, ఈలా పెక్కుభంగులుగా పద్యాలనడక తయారయింది.

పద్యంవలన కలిగేది యేమిటి? ఎవరికి? ఎందుకు? ఆలంకారికులు చెప్పినట్లుగా ఈనాడు కావ్యం రచయితకు (పద్యం లేదా గద్యం) అర్థంకృత్తు అవుతూ స్వవిషయంలో మాత్రం అనర్థకృత్తు అవుతోందేమో అనిపిస్తోంది.

పూర్వపు పద్యాలు ప్రజల్ని ధర్మం సంస్కృతి మొదలైన వానిలోనికి గొనివెళ్ళి అలౌకికానందాన్నిచ్చి, కర్తవ్యపరాయణుల్ని, ఏకాగ్రుల్ని చేయడానికి ప్రయత్నిస్తే నేటివి ప్రజల్ని అంతర్ముఖుల్నిగా అంటే మరొకరిని చూడలేనివారినిగా, సర్వంతమలోనే చూచేవారినిగా లౌకికుల్నిగా చేయడానికి ప్రయత్నిస్తున్నాయేమో? దేశకాలాదుల్ని బట్టి మనం యెంత మారినా మన ఆలోచనా విధానం మారినా, పరిస్థితులు మారినా పద్యానికి గమ్యం ఏమిటి? వెనుకటి పద్యాలు కథాదులతో మనకు రసానుభవాన్నివ్వడానికి యత్నించినాయి. నేడు కొంతమంది వెనుకటికాపీలు దిద్దుతున్నారు. మరికొందరు క్రొత్తి మార్గాలు వెదకుతున్నారు. ఇన్ని శతాబ్దాల చరిత్రవున్న పద్యం క్షీణయుగం చీకట్లోంచి తిరుపతి వేంకటకవుల అవధానకాంతిలో బయటికి వచ్చినట్లుంది. కాని చిరకాలం చీకట్లో మ్రగ్గిన కారణంగా వెలుతురుని చూడలేకపోతోందేమో? పద్యం వలన కలిగే అనుభూతికో స్పందనకో మరోదానికో శబ్దార్థాల సహకారం సముచితం కావలసిందేకదా! రుచిభేదం మనుష్యుల తిండిలోనే కాక కవిత్వంలో కూడా వుంది. ఆలంకారికులు అంక అంత శాస్త్రం తయారుచేశారు. కవులు వాళ్ళకు అందినట్లే ఉండి అందకుండా వున్నారు.

పద్య నిర్వహణలో కేవలం శబ్దాలంకారానికి ప్రాధాన్యం యిచ్చి 'మహిమా హిమాలయం' అని వ్రాసినవారూ, పాదపూరణానికై చిత్రవిచిత్రపదాలు చేర్చినవారు, పేలవమైన శబ్దంతో గంభీరార్థాన్ని చెప్ప యత్నించిన వారూ, ఇలా అనేకవిధాలుగా ప్రతిభా శుష్కమైన కవితా స్వయంవరంలో భగ్నులూ, అభగ్నులూ అయివున్నారు. పద్యంలోని శబ్దార్థాలు సముచిత సన్నివేశాలయితే చాలా బాగుంటుందని అంగీకరించినవారికే 'పర' లో కనబడిన దిదృక్షు 'స్వ' లో కనబడదేమో?

దానికికారణం బహుశః ఇప్పటి 'కవి' లోని భాషా పరిచయం, ప్రాచీన పరిచయం, అను శీలనాశక్తి మొదలైనవిమర్శక లక్షణాలు శబ్దార్థాల్లా వుండవలసిన పద్యంలాంటి కవిలోని కవితా విమర్శకతా సమన్వయలోప రూపకాలేమో? మనం కాపీలు దిద్దడం అక్షరాలు సుందరంగా వుండడానికే కాని మళ్లావాటినే అలా వ్రాయడానికి కాదేమో? పద్యమైనా గద్యమైనా రూపకమైనా మరొకటేదైనా స్వయం వ్యక్తిత్వం ముఖ్యమేమో అనిపిస్తుంది. ఛందస్సు వేదమంత్రాలకుంది. ఛందోబద్ధమైన పద్యానికి వేదపవిత్రత రావాలని వారి అభిప్రాయమేమో? ఛందస్సువలని అను స్యూతత సామాన్యుల ఆకర్షకమైతే అక్షర రమ్యత కూడా వారికే అయితే పండితులకి అర్థసౌభాగ్యం ముఖ్యం అయితే సహృదయులకి శబ్దార్థ సాంగత్య రమ్యత ముఖ్యమేమో? పాల్కురికి సోమనవంటివా రాదరించిన ద్విపదరీతి మాని, నన్నయ చూపిన పద్యం యింతకాలం యిలాగైనా వుండడానికి కారణం యేమిటి? ఇన్ని వందల సంవత్సరాలు ఇంతటి మహా మనీషులు స్వయం ప్రతిభులునైన మనకవులు భిన్నమార్గాలు త్రొక్కక పద్యం లోనే తమ 'దర్పం' చూపడం యెందుకు? ఏకాక్షరీ ఛందస్సు మొదలుకొని బహువర్ణ పర్యంతం సాగిన ఛందోలతాకిసలయములే మయినాయి? ముదురు టాకులు మాత్రమే యిన్ని వైపరీత్యాలకి నిలబడి నేటికీ మనకి కనిపిస్తున్నాయి యెందుకని? కవిత్వం పద్యంలోనే వుండాలి మరోదానిలో వుంటే కాదని మా అభిప్రాయం కాదు. నదీప్రవాహం యెలాగైనా యెన్నిరకాలుగానైనా ప్రవహించవచ్చు. చివరకు సముద్రంలో పడవచ్చు. పడకపోచ్చు. కాని ఉభయతీరాలు పటిష్ఠములై ప్రవాహానుకూలంగా వుంటే బాగుంటుంది. స్పందన, అనుభూతి, లేదా మరొకటి పదంచేత కాని, పదసమూహంచేత కాని రావచ్చును. ఆ 'అది' దేనికి? కవికా? పాఠకుడికా? దేశానికా? దాని వలన ఆస్వేతరులకి ప్రయోజనం యేమిటి? అంతర్వాహినియైన సరస్వతీ ప్రవాహం పల్వలతుల్యం కాగూడదు. అలాఅయితే పద్యంకంటే మద్యమే ప్రయోజనకారి యేమో.

పద్యానికి స్వాత్మావందలవీభూతత్వం చిహ్నం కాకూడదు. ప్రాచీనులు సర్వోపయోగానికే కథాదికాన్ని స్వీకరించి దాన్నొక ఉపాసనగా భావించినారేమో? నన్నయలా ఆదేవృత్తం అవే యతి ప్రాసలతో వ్రాసి అభినవ పదపూర్వ

కంగా ధరించడం, మనకి ఉత్కర్షా? వారికి అపకర్షా? అప్పుడు పరమావధి అనుకరణే నా మరొకటా? ఈ పద్యానికి వర్గాలూ, వర్ణాలూ శాఖలు దాన్ని పురస్కరించుకొని రాగ ద్వేషాలు కల్పించాము. కవిని కవిత్వాన్ని విభజించి చూడడం మంచిది కాదు. విమర్శ మంచిదే. గౌరవం మంచిదే. కాని అవి నిరుపాధికంగా అంటే నిర్వ్యాజంగా వుండాలి. మన పద్యం కాదు కదా మనకెందుక నే కవితా సాత్వికులే పద్యానికి మొదటి శత్రువులేమో? ముగమాటానికో మరో దానికో లోబడి 'భేష్' అనే (పరస్పర) సహకారం కూడా మరొకటేమో? అచ్చయితే అదిసత్యమే అనే దుర్భ్రమ మరొకటేమో? ఇంకా ఊహాకందని వెన్నో?

నవల నాటకం, గేయం, గద్యం మొదలైన సారస్వత ప్రక్రియల్లో పద్యం ప్రాచీనం. దాన్ని మనం జాగ్రత్తగా కాపాడుకోవలసిన బాధ్యత వుంది. ఈలాగని మిగిలిన వాటికి హైన్యం అనుకోవడం మరో భ్రాంతి. ఇన్ని శతాబ్దాలు నిలిచిన పద్యం యోగం వుంటే నిలుస్తుంది లే మనకెందుకు దానిగొడవ అనుకుంటే ముందువాళ్ళ కేమిటి? మిగిలిన వున్నాయి కదా! ఇదెందుకు అనే వాదన కొంత. పిత్రార్జితం కాపాడుకోవలసిన బాధ్యత మనది. రూపాయి విలువకంటె హీనంగా వున్నది పద్యం. పుడితే పద్యం, వస్తే పద్యం, వెడితే పద్యం, వెళ్ళకపోతే పద్యం, యిలా ఆలోచిస్తే పద్యం లేని సందర్భం యేది? ఇది యింత చవుక అయి పడిపోవడం యెందువలన? బిరుదుల్లో కూడా అనుకరణ దేనికి? వెనుకటి వాళ్ళకి మల్లే స్వతంత్రంగా సహజంగా యెందు కుండకూడదు. ఇది యెవర్నీ వ్యక్తిగతంగా వుద్దేశించింది కాదు. మొత్తం కవి సముదాయాన్ని నేటిక విజాతిని పద్యాభిమానుల్ని ఉద్దేశించింది. వారిమీద ద్వేషం వల్ల కాదు. పద్యంమీది మమకారం వలన. గణాల్లో కూడ విషమగణాలు వగైరా




## చైత్రవంది (భావగీతాలు)

( కవి: శ్రీ శనగన నరసింహస్వామి, ప్రచురణ: ప్రతిభా కావ్యమాల, ఏ. యల్. కాలేజీ స్టాఫ్ క్వార్టర్స్, గుణదల, విజయవాడ-5, పేజీలు సుమారు 150, మూల్యము రు 8-00 లు.

ఈ ఖండకావ్యసంపుటి పేరు చైత్రవంది. వ్రాసిన కవి సుగృహీత నామధేయులైన శ్రీ శనగన నరసింహస్వామి గారు. సాంప్రదాయిక ఛందశ్శరీరాన్ని ధరించి, ఆధునిక భావ ప్రాణవాయువులు శ్వాసగా కల్గియున్న నిజమైన కావ్యం ఇది. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు, కీ. శే వేదుల సత్యనారాయణశాస్త్రి గారు కవితావిషయంలో నరసింహస్వామి గారిని ప్రభావితుల్ని చేసినట్లు వాచ్యంగానే చెప్పఁబడింది.

'చరమగీతి' అన్న ఖండికలో కవి మృత్యుదేవతను సాదరంగా ఆహ్వానిస్తూ

"కృష్ణపక్షము నక్షులం గీలుకొల్పి
ఎడద దీపావళీ కాంతు లేసరేగ
ప్రతినిమేషము కవితకై బ్రతికినాఁడు
అంచు స్మరియించుకొందు వీ వదియె
చాలు."

అని ఒక మిత్రుని ఉద్దేశించి పలికిన పలుకు భవిష్యత్తులో తన అభిమానులు తన్ను గూర్చి నిర్దిష్టంగా అనుకోగలిగిన (వలసిన) మాట - అన్నమాట.

"ఎవరు మీరిటు లెటకేని యేగు నన్ను
కఠిన శృంఖలా చయముల గట్టివైచి
విచ్చుకత్తుల బూని వేవేగ దెచ్చి
దూరశూన్యాధ్వమునయందు త్రోసి
నారు"

అన్న శ్రీ నరసింహస్వామి గారి కంఠంలో కృష్ణ (పక్ష) కవి వినబడుతున్నాడు. అట్లాగే

"అపుడపుడు నీవువత్స! నాయంతికమున
గాన మొనరింపు మనుచు నాహ్వానలేఖ
పంపితివి గాని శ్రుతి అపభ్రంశ మగునో
లయ లగింపదో యనుచు తల్లడముపడితి."

లోకకల్యాణానికో వైయక్తిక ప్రమాదానికో దారితీయ దగిన వున్నాయని లాక్షణికుల సూక్తి. ఒకవేళ అటువంటి చికాకు వుందేమో? ఈ శతాబ్దంలో యీ మాట హాస్యాస్పదం కావచ్చు. నమస్తస్మై బుద్ధిశాలినే.

కాబట్టి పద్యానికి విలువవుందా? యేమిటది? దాని వలన లాభం యెవరికి? యెంతవరకు? వగైరా ప్రశ్నలకి సముచిత విచారణ చేసి దానిని నిలబెట్టే ప్రయత్నం చేసి శారదాసేవకై యత్నించి ఆదరించడం మన కర్తవ్యమేమో? సాహిత్యకురుక్షేత్రంలో 'గాండీవం స్రంసతే హస్తాత్' అనకుండా కర్మణ్యేవాధికారః అని యత్నించడం కవి సహృదయుల కర్తవ్యం అనుకుందాము. అది సర్వదా సర్వథా దేశకాలాది బద్ధమైన రాగద్వేషాదికానికి భిన్నమై కవితాపరమావధియైన అలౌకికానందానుభూతిని స్వయంగానే కాక పరులకు పంచిపెట్టడానికి వీలవుతుందేమో? సమర్థులు విజ్ఞులు సహృదభావుక కవితా శిరోమణులూ అట్టి ఆనందానికై యత్నింతురని మా ప్రార్థన.

ఆనందో హృది లభతాం ప్రతిష్ఠామ్.

అన్న శ్రీ స్వామిగారి స్వరంలో వేదుల వారి దీపావళిలోని

"ఏ సడిలేక ఈ ప్రకృతి
యెల్ల నిశీథ తమోనిబద్ధమై,
నీ సుకుమార హస్తముల
నిద్దురపోయెడి మూనవేళ, నీ
వే సరిచేసి యీ శిథిల
వీణను మీటుమటంచు నాపయిన్
ద్రోసెదవేల? తీగ తెగు
నో శ్రుతిదప్పునో పల్కదో ప్రభూ!"

అన్న పద్యం సూక్ష్మశరీరాన్ని దాల్చి సాక్షాత్కరిస్తున్నది.

వీరి చరమగీతి లోని మొట్టమొదటి పద్యం ఇక్కడ ఉదాహరించకుండ ఉండలేకపోతున్నాను. శ్రీ నరసింహ స్వామిగారు మృత్యుదేవతను ఎల్లా ఆహ్వానిస్తున్నారో చూడండి!

"వ్యాససంయమి భారతాగమామృతమును
శ్రుతిపుటమ్ముల నారగ్రోలునపుడో
వాల్మీకిముని రఘూద్వహ పుణ్యగాథను
చిత్తమ్ములోన నర్చించునపుడో
కాళిదాసుని కావ్య కాకలీ గీతాలు
గొంతెత్తి మతి పాడుకొనెడునపుడో
భవభూతికరుణోక్తి పావనోత్తమరామ
చరితమ్ము కన్నీట చదువునపుడో
ఒక్క మధుమాసదినమున దిక్కులందు
మందమలయానిలమ్ములు మలయువేళ
అల్లనల్లన దరిజేరి ఆర్ద్రపాణి
మృత్యుసుందరి నను కౌగిలించుగాక!"

మృత్యుదేవతను సుందరిగా భావించగలిగిన "గుండెలు" ఉన్న మగవాడు శ్రీనరసింహస్వామి. వీరి ఈ ఊహ వింటే - సాక్షాత్తుగా ఆమధ్య జరిగిన ఒక సంఘటన గుర్తువస్తున్నది. గుంటూరు హిందూ కాలేజీ ప్రిన్సిపాల్ గారైన శ్రీ వల్లభజోస్యుల సుబ్బారావుగారు (ఆంగ్ల, సంస్కృత, ఆంధ్రభాషల్లో దిట్ట) ఢిల్లీ వెళ్తూ రైలుపెట్టెలోనే పరమపదించారు. మరణించినట్లు గ్రహించి చూచేసరికి, వారి గుండెలమీద కీట్స్ వ్రాసిన గ్రంథం ఒకటి తెరచి బోర్లించి పెట్టబడి ఉంది. కీట్స్ వారి అభిమాన ఆంగ్లకవి. ఆ కవితా సుధాపారణ మధ్యలోనే వారి అంతిమశ్వాస ఆగి ఉండాలి.

శ్రీ శనగన నరసింహస్వామి ఋషిగ్యైన కవి. వారికి జీవితంలో ఉన్నతృప్తి ఎంతటివిరాగితను సూచిస్తుందో చూడండి!

"సౌధమునుగోర నొకపర్ణశాల చాలు,
భోగములనొల్ల నుదరసంపూర్తి చాలు"
"అంబరము లంటు చిత్రసౌధంబులార!
రంగురంగుల రత్నాంబరంబులార!
అవధులెఱుగని భోగభాగ్యంబులార!
నన్ను కవ్వింపకుడు మహానటనలార!"

ఇవి పెదవులమీది మాటలు కావు. వారి జీవనవిధానం పైవాక్యాలకు జీవత్ వ్యాఖ్యానం.

'సర్పయాగము' అన్న ఖండికలో "బాధాసర్పదష్టులార!" అని శ్రీశ్రీ వలె సంబోధించి, ఆ బాధాసర్పాలన్నీ కావించే సామ్యవాదయజ్ఞం అనే సర్పయాగంలో భస్మం కాబోతున్నవి అని-శ్రీశ్రీ అన్నవిషయాన్ని కవి సూచిస్తారు. అన్నిబాధలకు కామాది అరిషడ్వర్గాలు బీజాలు. తనకు ముందు వాటిని భస్మంచేయాలని కవి ఎంత ధాటిగా వ్రాసచ్చారో వినదగింది. యజ్ఞాగ్నికుండంలో పడేందుకు రకరకాల సర్పాలను నరసింహస్వామిగారు ఆహ్వానిస్తున్నతీరు క్రుద్ధుడైన ఋషీశ్వరుని శాపవాక్కులా ప్రతిధ్వనిస్తున్నది.

"కామకర్కోటకా! వేగ కదలిరమ్ము!
గద్దె దిగిరమ్ము! లోభతక్షక భుజంగ!
క్రోధమద మోహ మత్సర క్రూరఫణులు!
కండుభస్మము యజ్ఞాగ్ని కుండమందు."

ఇదే జరిగితే విశ్వశ్రేయస్సు కరతలామలకమే. దానినుండే జగద్ధితమైన "సమసమాజము జనించు" అని సిద్ధాంతం చేస్తారు కవి ఖండికావసానంలో. ఒక క్రొత్త సామాజిక వ్యవస్థ ఉత్పన్నం కావాలంటే "త్రికరణశుద్ధి" అన్నది ప్రతి వ్యక్తికి అవసరం. అప్పుడే సంఘం ఈ నాడు ఎదుర్కొంటున్న కష్టాలన్నీ కడతేరతాయి-అని వీరు ఆశించిన పద్యం అమృత గుళిక.

"నేను త్రికరణ శుద్ధిగ ఈ నవీన
యజ్ఞమొనరింతునేని లోకజ్ఞులెల్ల
సహకరింతురయేని ఈ సవన వీథి
అంకురింపక పోవునే అమృతఘటము!"

"త్రికరణశుద్ధి, లోకజ్ఞులు, సహకరిస్తే" సమసమాజం అమృత ఘటంలా అంది వస్తుంది అని కవి నిశ్చయం.

"నిశిత తుహినాంబు వృష్టిలో శిశిర వేళ
దారితప్పిన యోబాటసారులార!
నవయుగారంభ వీక్షణోన్నయనులార!
స్వాగతము రండు మాపర్ణశాల వైపు"

అన్న పద్యంలో, నవయుగారంభ వాసంత చైత్రఘటికలకు స్వాగతం పలికే 'వంది'గా గోచరిస్తారు శ్రీనరసింహ స్వామిగారు. అందుకే ఈ కావ్యం చైత్రవంది.

94వ పుటలోని ప్రథమపద్యద్వితీయ పాదం ఇల్లా అచ్చైఉంది. "వాయు వీచుల పయనించు మోవి యోగ వేదనా రావములు..." ఈ తేటగీతి పాదంలో

యతి భంగం. బహుశః ఒకటి జరిగి ఉంటుంది. కవిగారు మొదట వ్రాసికొన్న పాదం "వాయు వీచుల పయనించు మాయయోగ..." అని అయ్యుండాలి. ప్రాసయతి వేసుకొన్నారు. అయోగ, వియోగ శబ్దాలు ఏకార్థకాలు కావడం వల్ల, రూపసామ్యం కలిగి ఉండడం వల్ల సాఫుప్రతిలో 'అయోగ' స్థానంలో వియోగ అన్న ప్రసిద్ధపదం పడి ఉంటుంది.

99 వ పుట యందలి చివరి పద్యంలోని ప్రథమపాదం "ఉత్తరరామ రూపక మనుత్తమ మారచనమ్ము సర్వలోకోత్తమము..." అని అచ్చు పడి ఉంది, అనుత్తమ శబ్దము శ్రేష్ఠతావాచకమే యయ్యు విపరీతార్థసద్యస్ఫురణ కలిగించేదిగా ఉన్నది.

"చెలగు, ఆటి పోయిన, ఒక్కమాటైన, ఎలుగు," వంటి పదాల్లో లక్షణసిద్ధమైన శకటరేఫ ప్రయోగాన్ని సైతం పాటించిన నరసింహస్వామి గారు కావ్యరచనలో అర్ధానుస్వారాలు కూడ పాటించే ఉండాలి. అయితే ఈ ప్రతిలో ఒక్కచోటగూడ అరసున్న లేదు. బహుశః విజయవాడలోని 'Best Printers' వారి ముద్రణాలయంలో అర్ధానుస్వారాలు లేకుండి ఉంటాయి అనుకోవాలి.

మొత్తం మీద ఈ కావ్యం శ్రీ నరసింహస్వామిగారి ప్రతిభను, భావ పటిమను, ఉక్తిచమత్కారాన్ని, ఆర్ద్రహృదయాన్ని నిండుగా వ్యక్తం చేస్తున్న ఉత్తమగ్రంథం.

శుభం భవతు।

— సుగుణారాధక.

# బిడాల మోక్షము

(రచయిత. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు గారు, శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణా జిల్లా, వెల రెండు రూపాయలు.)

శబ్దార్థముల సాంగత్యమును నిరూపించుటలో మన ప్రాచీనులు ముఖ్యముగా నభిధా లక్షణా వ్యంజనా వృత్తుల నేర్పరచిరి. స్వల్పభేదమునననుసరించి వీని సంఖ్యలో మతభేద మున్నది. వ్యంజనా వ్యాపార పరిణామము క్రమముగా గుణీభూతవ్యంగ్యమై తుద కన్యాపదేశత్వ ప్రధానమైనది. మహిష శతకాదులు శ్లేషమూలకములైనవి. తెనుగులో నట్టి కావ్యములు తక్కువ యని చెప్పవచ్చును. ఇట్టిమార్గములో నాధునికములైనవానిలో బిడాలమోక్ష మొకటి. దీని రచయిత శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు గారు.

బిడాలమోక్షములోని వృత్తసంగ్రహమిది. మందరప్రాంతమునందలి యడవిలో మృగములు సింహమును రాజుగానుంచి కాలక్షేప మొనర్చుచుండగా నట కొక మార్జాలము వచ్చి సింహగుహను ప్రవేశింపబోయి భంగపడి మృగరాజుగా దన్ను బ్రకటించుకొనెను. ఉన్మత్తబళముపై మృగరాజని వ్రాసికంఠమునం దగిలించుకొని తిరుగుచుండెను. కుక్కయొకటి దానిని త్రెంచెను. పిమ్మట వృద్ధ జంబుక మొకటి దానికి మంత్రియైనది. దాని సూచనపై మృగరాజని వాత పెట్టించుకొన్నదా పిల్లి. ఎలుకలను బిలిచి తన కీర్తిని ప్రకటింపుం డని యవి యిచ్చిన గంటను గళమున ధరించెను. తుదకొక గజము నెదిరించి పరాభూతమై మృగరాజగు సింహము దయ చూపగాం బ్రాణములను నిలబెట్టుకొనెను. తుదకు సింహము దానికి బుద్ధిచెప్పి మరల వాతలు పెట్టించెను.

ఈకథవలన మూఢుడొక డుత్పథగామియై యున్నతి నందగోరి పడిన భంగపాట్లు వ్యక్తమగుచున్నవి. "శార్దూల మత్తేభ సంసక్తిసత్కవీశ్వర కావ్యరీతిం గైవసముజేయు" వంటిపద్యములం శ్లేషమూలకములై, మనోరంజకములైయున్నవి. పద్యగమనము నిరాఘాటముగా సాగినది. ఐకకంఠ్యాదిపదములు కవికిగల భాషావైదుష్యమును వెల్లడించును.

మొదటిపద్యములో మదేభసైరిభ... పంచనఖాది ఘీంకృతిస్ఖలిత' ఇత్యాది సమాసములో గజము, సైరిభము మొదలగు వాని ఘీంకృతు లనుట పొసగునా? ఘీంకృతి గజేతరములకు లేదు కదా! పద్యములకు సంఖ్య యున్నచో బాగుండెడిది. 72వ పేజీ మొదటి పద్యములోని మహామృగ, మందరగ్రావగుహాంతరమ్మున క్రీగీటు గీచిన పదములు పాదపూరకములుగా నగపడును. ఇట్టివి బహుళములు. 3వ పేజీ రెండవ పద్యములోని పదవీ ప్రతిష్ఠలకు పదము విచారింపదగినది. సంస్కృత పదవిమార్గమును జెప్పును. తెనుగుపదవి యుద్యోగవాచకము నైనది. ఆ తెనుగర్థములో సంస్కృత సమాసము పర్యవసన్నము కాదుకదా! అందే 3 వ పద్యమున 3వ పాదమున 'శాంతి సుఖ భూమిగ దేశ మొనర్ప శక్తి సంపదలను ధారవోయవలె' ఇట దేశము అన్నది ద్వితీయ స్ఫూర్తినిచ్చునా? ఇట్టిదే 5వ పేజీలో 'ఖడ్గనాథుడు సైనిక వ్యూహములు గావ' లోని వ్యూహశబ్దమును. వీరికి మూషికపదము కంటె మూషక పదమే యభిప్రేతమైనట్లున్నది. 6వ పేజీలో 3వపద్యమున కుక్కచే దెబ్బతిన్నపిల్లిని వర్ణించుచు అదియె మొదలుగ ఇత్యాది పద్యముచివర 'జాలి యొదవెడి నాకా బిడాల మనిన' ఇచటి 'నాకు' ఎవరికి చెందినది? తరువాతి పద్యము బిడాల స్వాగతముగా నున్నది. 8వ పేజీలోని 4వ పద్యములో 3వ పాదము 'అతడు కందరమం

దు నితడు కోటరహంస' ఇందు అందు క్రియయా, విభక్తి ప్రత్యయమా? క్రియయైనచో నర్థవిశేషముండునా? 10 పేజీలో 1వ పద్యము 3వ పాదములో 'నానోహాగానమ్ములుపాడె' అర్థసద్యస్ఫూర్తి లేదు. 17వ పేజీలో పిల్లియెలుకలను 'అబలవృషమ్ములార' యని సంబోధించుట దూరార్థకము. సవతి తల్లిప్రేమ మొసలికన్నీళ్ళు' వీనిని సంస్కృతీకరించుట సద్యస్ఫోరకముగా నగపడదు. 21వ పేజీలోని 3వ పద్యములోని 'సింహఘాల వలయమ్మో' యిట్టిదే. ఇట్టివి బహుశములు.

పాత్రపోషణాదులలో తగినశ్రద్ధయగపడదు. మృగస్తోత్రముచే నిద్రోత్థితమైన సింహమును మృగములు రాజుగా నుండగోరగా, సింహము లోనిసాత్వికతను మరొక్కని జూడు డనుటద్వారా కవి సాధించిన దేమి? సింహము మెడలో పుష్పహారమును శిరమున కిరీటము నుంచుటయు నసహజములుకదా! పిల్లిని జూచి జాలిపడిన మృగములు దాని మృగరాజత్వము నెదిరింపకపోవుటయు దాని నొక నక్క,గజము,పరాభవించుటయుపరస్పర విరుద్ధములై మృగస్థాన మగు 'సంఘమును' వాచ్యముచేయుచున్నవి. పిల్లి మృగరాజ భావనాభరితమైనను మార్జారత్వమును విస్మరించుటయేకాక దానిని నిందించుట యెబ్బెట్టుగ నున్నది. (11వ పేజి 1వ పద్యము) ఉన్మత్తదళముపై వ్రాసిధరించినట్లు కంటె తాళపత్రముపై వ్రాసినట్లున్న సముచితముగా నుండెడిదేమో? 12వ పేజిలో నక్కను పిల్లి 'కపటజంబుకశవమ్ము' అని శవరూపమున నిందించుటయు మృగానురూపముగా లేదు. 17వ పేజిలో ఎలుకలకైన సందేశములో ఇదె వ్రాసియిచ్చితిన్, మీసహకారమీవలెన్, అక్షరలక్షల నిచ్చెదన్ 18 (పేజి) 20 పేజిలో ఎంతయో డబ్బు గడింపవచ్చు. వంటివి యసహజములైనవి. కవిగారికి పోతన కవిత్వముపైగల యారాధనానుకరణబుద్ధులు గజమార్జాల కోలాహలమున, సింహము మార్జారరక్షణకై దుమికినప్పుడు, పేయేల ప్రారంభమునుండి పోనుపోను ప్రస్ఫుటతరమైకానవచ్చును. మార్జాలప్రార్థన మొదలైవన్ని యునట్టివే.

ఇట్టి శబ్దార్థసాహిత్య సంయుక్తమైన దీనికి బిడాలమోక్షమని పేరిడిరి. పోతన గజేంద్రమోక్షము భక్తిప్రధానము రససమ్మితము నయియుండగా, దదనుకారిణి యగు వీరి కవిత హాస్యప్రాయమై రసభంజకమై యున్నది. విచక్షణారహితమగు అనుకరణ మూలఘాతక మగుననుటలో సందేహము లేదు. బిడాలమునకు మోక్ష మేమి? దేనినుండి? ఎంత సమన్వయ పరచినను సహజముగా లేదు. ప్రతి యింటను పాలు పెరుగులకై తాపత్రయపడు పిల్లిని వర్ణించిన నింత కంటె రసవత్తరముగా నుండెడిదేమో? రచనావిన్యాసము, పాత్రపోషణాదికము, పాశ్చాత్యవేషమున శ్రీరాముని సాక్షాత్కారమువలె నున్నది. అనుకరణ కవికి తప్పనియాపదలలో ముఖ్యము. దానికి పశ్యతోహరులై చరింపగల కవులుం సుకవులే. అందు వీరు పద్యరచననుబట్టి యాశించినంతగా నెరుగలేకపోయిరి.

వీరి పద్యరచన నిరాఘాటమై నడిచినది. పోతనగారి యొరవడి శబ్దములో నగపడును. దీనిని భాషాప్రవీణ ప్రవేశ పరీక్షకు పాఠ్యముగా నిర్ణయించుట దీని యుత్కృష్టతను చాటుచున్నది. ఎత్తుగడ, సంఘటనాదికము బాగుగ నున్నవి. శ్రీ కవిగారింకను మనోహరములైన రచనలనేకము గావింపగలరని ఆసించుట మరింతజాగరూకతతో మరిన్ని రచనలు చేయగలరని కోరుట యసమంజసము కాదు.

– శ్రీ ప్రసాద్.

---

# Beauty & The Poet

By R. M. Challa,

[ 'Das Schloss' Publications, 46-22-71, Danavaipetn, Rajahmundry-533103, Price Rs. 3-00

'బ్యూటీ అండ్ ది పోయెట్' (Beauty & the Poet) అనునది పదిహేను పేజీల చిన్న పుస్తకము. ప్రసిద్ధ విమర్శకులు, ఆంధ్ర విశ్వవిద్యాలయ భూతపూర్వ వైస్ ఛాన్సలర్ శ్రీ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ ఈగ్రంథమునకు 'ముందుమాట' వ్రాసిరి. తనకు స్ఫూర్తిని కల్గించిన – తను ఎన్నడూ చూడని – ఒక కలం స్నేహితురాలికి కవి ఈకవిత నంకిత మిచ్చినాడు.

దీనిని కొన్ని కవితలసంపుటి అనుటకు వీలులేదు. ఒకేఒక పెద్ద కవిత అనియూ అనలేము. ఒక ఆలోచనాతరంగము ఒక 'యూనిట్' గా పదిహేను పేజీల కవిత్వము వేర్వేరు ఖండికలుగా విభజింపబడినది. ఈవిధముగా రెండు పంక్తుల ఖండికలు మొదలు పదహారుపంక్తుల ఖండికల వరకు అనేక–చిన్న, పెద్ద కవితలు ఈపాత్రములో నున్నవి.

'సౌందర్యము–కవి' అను ఈగ్రంథములో సామాన్యముగా కవులుపొందే సౌందర్యానుభూతి యొక్క సాధారణీకరణ కాదు ఉన్నది. ఒకానొక కవి యొక్క విశిష్టసౌందర్యోపాసన, తదనుభూతి, మరియు తన్నిరూపణ ఇందున్నవి. ఆకవి (the poet) మరెవరో కాదు. శ్రీ రాధాకృష్ణమూర్తి గారే అన్న అభిప్రాయము అయ్యంగారు వ్రాసిన 'ముందుమాట'వల్లకూడా బలపడుచున్నది. 'సత్ + చిత్ +ఆనంద' స్వరూపము, శాశ్వతము, నైన బ్రహ్మస్వరూపమును సౌందర్యము ద్వారా అవగాహన చేసుకొనవచ్చు,అనుభవింపవచ్చు, నను సిద్ధాంతము ప్రాతిపదికగా ఈకవిత్వ ముద్భవించినది.

ఈ సౌందర్యము ప్రకృతిగతమైనది కాదు, కావ్యగతమైనది; ఇక కవితామయ సౌందర్యము. ప్రారంభమునుండి, అంతము వరకు పలుమారులు కవి 'కవితా సుందరి' ని ఆవాహన చేస్తాడు - 'Beauty, O Beauty, Beauty of my muse,' అని సంబోధించి తనకు ఆమెకు మధ్యగల భిన్నత్వమును, ఏకత్వమును, పరస్పరాశ్రయమును, తన ఆరాధనను, ఆమె అనుగ్రహమును, తమ అవినాభావ సంబంధమును చక్కని ఉపమానములతో మనోహరముగా చిత్రించినాడు కవి. కవితాసుందరియే విశ్వసౌందర్యరాశిగా కన్పట్టును. ఆశామోహములు, రాగద్వేషములు, జయాపజయములు, సర్వ ప్రాపంచిక విషయములు సారహీనములుగా, అసంగతములుగా కన్పట్టును. 'మాయ' యొక్క ఆవరణము తొలగి శాశ్వత సౌందర్యము దర్శన మిచ్చును. కవి ఆ సౌందర్యముతో తాదాత్మ్యము చెందును. ఇప్పుడు కవీ, సౌందర్యమూ ఒకటే. సత్య, శివ, సౌందర్యరూపియైన కవి భూమ్యాకాశములను, విశాల విశ్వమును, సూర్యచంద్రులను, సమస్త చేతనాచేతన జగతిని, తన బాహుబంధములో, తన మదిలో, తన ఆలోచనలో బంధించును - సమస్తము తానైయైపోవును.

ఇట్టి కల్పన క్రొత్తదికాదు. పందొమ్మిదవ శతాబ్దిలో అమెరికాదేశస్థుడైన 'విట్మన్' ఇట్టి కవితను ప్రారంభించినాడు. అంతకు పూర్వమే సౌందర్యము ద్వారా సత్యాన్వేషణను ఆంగ్లకవి జాన్ కీట్స్ చేసినాడు. శ్రీ రాధాకృష్ణమూర్తి గారి కవితలో భారతీయ యోగ, దార్శనిక సిద్ధాంతముల ప్రభావము ప్రస్ఫుటముగా కన్పట్టును.

ఈ కవితావస్తువు మిక్కిలి గహనమైనది. వేదాంతమునుకాని, ఆధ్యాత్మికానుభూతులనుకాని కవితా రూపమున అందిచ్చుట ఎంతయో కష్టమైనపని. విడివిడిగా శ్రీ మూర్తిగారి ఆలోచనలు, భావనలు చక్కటి వ్యక్తీకరణ పొందినవి. కాని ఈ పుస్తకము ఒక కావ్యముగా భాసించదు. ఆలోచనలు, అనుభూతులు ఒక క్రమపద్ధతిలో పొందుపరుపబడలేదు. ఒక సాధకుని సాధనలో పరిశీలన, పరిశోధన, కృషి, విజయము - ఈవిధముగా ఆరోహణ క్రమములో ఆనందోపలబ్ధి జరగును. దీనిని కవి కావ్యగతము చేయవచ్చును.

దీనికి ప్రతిగా వేరొకని వ్యక్తీకరణ అవరోహణ క్రమములో ఉండవచ్చును. పరబ్రహ్మ స్వరూపమును, సత్య-శివ-సుందరములను సాక్షాత్కరింప చేసికొన్న జీవునకు ఈ భౌతికప్రపంచములోని అత్యల్ప వస్తువు సైతము ఆనంద-సౌందర్య స్వరూపముగా కన్పించును. ఈ రెండింటిలో (Ascent to or decent from Godhead) ఏరకమైన, ఏక్రమమైన అనుభూతి వ్యక్తీకరణ ఉండి ఉన్ననూ సొగసుగా నుండెడిది. రెండవ పేజీలోని ఈపంక్తులను చూద్దాము :-

'Now see how I embrace
the universe
in thee! I string my speech
to the music of
the spheres; I draw the
revolving planets into
mine arms; I reach beyond
the outer space
and bring the Milky way
into my mind.' (16-20)

కవితా సుందరి నాధారముగా, గొని సమస్త విశ్వమును ఆక్రమించిన త్రివిక్రము డీకవి. కాని, సౌందర్యము యొక్క తత్వాన్వేషణకు సంబంధించిన ప్రశ్నోత్తరములు చివరి పేజీవరకు కన్పట్టును.

Beauty, O Beauty, Beauty
of my muse,
Who art thou that thus
fill my every thought?
(పుట 8)

ఆలోచనలలోగాని, అనుభూతులలోగాని ఒక 'క్రమము' (system or order) కన్పించదు. నిజమే, ఆలోచనాసరళియే అంత. కాని, కావ్యము ఒక సుందరమైన ఏకాత్మరూపిగా కనబడవలెనన్న ఆలోచనలను, అనుభూతులను ఏదో ఒక క్రమములో పేర్చవలెను. ఇక్కడనే కవిలోని శిల్పము బయటపడును. ఆవిధముగా కావ్యమునంతను బంధించి ఉంచగల ఒక ప్రాథమిక సూత్రమేదో ఇందు లోపించినట్లున్నది. తత్కారణముగా వేర్వేరు అందమయిన పూసలు విడివిడిగా, చెల్లాచెదరుగా పడి ఉన్నట్లు కన్పించును కాని ఒక సుందరమయిన పూసలదండ తయారుకాలేదు.

సునిశితమైన మేధాశక్తితో, ఆంగ్ల భాషపై తనకున్న అనల్పాధికారముతో వేదాంత సంబంధమైన ఆలోచనలకు చక్కని పదచిత్రణలుగీసి మనముందుంచినాడు కవి —

O Beauty,
O rosiate dawn of fresh
recurrency,
incarnate in the rays of
poesy,
may thy fecundity of in-
spiration
incarnadine thine - mine
quotidian thought!
(పుట 3)

'Come, let us join hands'
for the advancement of
desireless desire,
for the accomplishment of
detached attachment,
for the achievement of
unselfish self... (పుట 7)

మిల్టను మహాకవి కూడా ఇంత చక్కటి Oxymoron అలంకారములు (విరోధాభాసాలంకారములు)

ఇంత ధారగా వాడలేదు. ఇటువంటి అందమయిన పదబంధములు, ఊహాచిత్రములు కోకొల్లలుగా నున్నవి. వీటితో పాటే —

'Matter is an appearance;
mind is a
reality : but mind and
matter meet
in the Universal Self as
known by the
individual self through
knowledge of itself—
(పుట 7)

వంటి 'అనుభూతి' లేని సత్యప్రవచనములు (statements) కూడా ఎన్నో వున్నవి. 'life's longest winter leads on to love's spring :' షెల్లీ శైలిలో సాగిన ఇట్టి చక్కటి పంక్తి వెనుకనే వచ్చిన beyond the sea of sadness lies the land of gladness : the horizon of bright hope borders the boundless sky of dark despair' (పుట 10) వంటి పంక్తులలో పునరుక్తి గోచరించును.

వేదాంతమును ప్రతిపాదించు కావ్యమును వ్రాయ నుద్యమించిన వర్డ్సువర్తు కవి నాందీప్రస్తావన 'The Prelude' మాత్రముచేసి తన ప్రయత్నమును విరమించినాడు. అట్టి ఉద్దేశముతోనే 'The Testament of Beauty' వ్రాసిన రాబర్ట్ బ్రిజెస్ (Robert Bridges) కవి సారహీనమైన కవిత్వము వ్రాసినాడను విమర్శకు గురియైనాడు. కవిత్వమునకు అనుభూతి ప్రధానమను నది ఆర్యోక్తి. అనుభూతిని వ్యక్తీకరించుట, సాక్షాత్కరింపచేయుట, కవి, పాఠకుడు ఏకమై రసానుభూతినందుట - ఇది సాహిత్యములో అప్పుడప్పుడు మాత్రమే సంభవించు చుండును. 'దర్శనము'ను, 'యోగము'ను Overhead Poetry అను క్రొత్త ప్రక్రియద్వారా విజయవంతముగా సహృదయ పాఠకున కందించిన ఘనత శ్రీ అరవింద మహర్షికి మాత్రమే దక్కినది. 'Beauty and the Poet' వ్రాసిన శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తి గారు భవిష్యత్తులో ఈకోవలో ఇంకనూ మంచికవితల నందించెదరని ఆశిద్దాం.

'సంఘమిత్ర'

# భారత ప్రాశస్త్యము - పరమార్థము

- శ్రీ డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం.ఏ., పిహెచ్.డి.

మనదేశమునకు భారతదేశమను నామ మేర్పడుటకుఁ గారణము నెవరేమని చెప్పినను, విశ్వవిఖ్యాతి నందిన మహాభారతమునకు జన్మభూమి యగుటచేతనే దాని కా పేరు సార్థకమని చెప్పనొప్పును.

వేదవిభాగమును గావించినట్టియు, విష్ణ్వంశసంభూతుఁడును నగు వ్యాసభగవానునిచే రచింపఁబడినది యీ గ్రంథరాజము.

ప్రాచీన భారతీయార్యుల విజ్ఞానమునకును, సంస్కృతికిని భారతము దర్పణమువంటిది. అంతేకాదు, మానవుల భౌతిక మానసికాధ్యాత్మిక జీవితముగూడ నందుఁ బ్రతిబింబితమయియున్నది. కావ్యశాస్త్ర వేదాంతాది గ్రంథములు మానవజీవితమునం దేక దేశమును మాత్రమే స్పష్టపఱుచుచుండ, మహాభారతము దానిని సాకల్యముగఁ బ్రదర్శించును. అది దర్శనమువలెఁ జతుర్వర్గప్రాప్త్యుపాయమును బ్రదర్శించును. శాస్త్రమువలెఁ గృత్యాకృత్య ప్రవృత్తి నివృత్తుల ననుశాసించును.

భగవంతుఁడగు వేదవ్యాసుఁ డిందు సాంగ వేదార్థోపబృంహణమును గావించి మాటిమాటికిని సద్ధర్మసమభ్యర్హణమును, గర్హణీయగర్హణమును జేసియుండెను. వేదార్థ సార సంగ్రహణముననే యిది పంచమవేదమను ప్రశస్తివడసినది.

మహాభారతము ప్రాచీనవిజ్ఞానభాండాగార మగుటయేకాక, రసవంతమగు లౌకికేతివృత్తముతో నొప్పు మహాకావ్యముగూడ నగుటచే విశ్వసాహిత్యమునందు వైశిష్ట్యమును గడించినది. విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుఁడును, మహర్షియునైన మహాకవిచే రచింపఁబడినదగుట నిది బహువిధ విభావానుభావ సంచారి భావములచే వివిధ రసాభివ్యంజకమయి, సుధామాధుర్యము నధఃకరించుచు, నభినవకావ్యమువలె సహృదయ హృదయాస్వాద్యమానమగుచున్నది. అనవద్యములును, రససిద్ధిచేఁ బ్రసిద్ధములును, హృదయాహ్లాదకరములు నగు కావ్యము లన్నియు మహాభారతమునే యుపజీవించుచున్నవనుట సత్యదూరముగాదు.

పాత్రవిషయమున మహాభారత మీ విశాలవిశ్వమువంటిది. విశ్వమున నసంఖ్యాక పాత్రము లుండునట్లే, భారతమునందును నెన్నియో పాత్రములున్నవి. సంఖ్యయందే కాక, వైవిధ్యమునందును విశ్వ-భారత-పాత్రముల కెంతేని సాదృశ్యము గలదు. భారతమున నున్నన్ని పాత్రములుగాని, వానియందున్నంత వైవిధ్యముగాని ప్రపంచమునందలి మఱి యే గ్రంథమునను లేనిమాట సత్యము. ఈ పాత్రనిర్మాణమునందలి సామర్థ్యము భారతకర్తయగు వ్యాసునకు సృష్టికర్తృప్రథను సంపాదించిపెట్టుచున్నది.

ధర్మశాస్త్ర నీతిశాస్త్రాదులయందలి విషయము లన్నియు సులభగ్రాహ్యమగు రీతిని వివరింపఁబడియున్న కారణమున భారతము స్మృతిగ్రంథముకూడ నగును.

సత్యాసత్యములకు, ధర్మాధర్మములకు జరగు సంఘర్షణమే యిందలి యితివృత్తము. పరమేశ్వరుని సర్వశక్తిమత్త్వ సర్వజ్ఞత్వము లిందు లెస్సగా స్థాపింపఁబడినవి. ధర్మమునకుఁ బాండవులను, నధర్మమునకుఁ గౌరవులను బ్రతినిధులను గాఁజేసి, పాండవ కౌరవయుద్ధముచే ధర్మాధర్మ సంఘర్షణమును సూచించి, తుదకుఁ బాండవవిజయముచే నంతిమ విజయ మెట్లు ధర్మమునకే యగునో యీ గ్రంథమున వ్యాసభగవానుఁడు నిరూపించినాఁడు. 'యతోధర్మ స్తతోజయ' యని మహాభారతము ధర్మవిజయము నుద్ఘోషించును. ఎంత నిగూఢములయిన ధర్మరహస్యములయినను రసవంతములగు నుపాఖ్యానములచే నిందు సులభగ్రాహ్యములుగా నొనరింపఁబడినవి.

అంతియగాక 'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ వంశానుచరితం చేతి పురాణం పఞ్చలక్షణ'మ్మను పురాణలక్షణములైదును భారతమున సమన్వితములగుటచే, నిది బహుపురాణసముచ్చయమనియు వ్యవహరింపఁబడుచున్నది.

మఱియు సకలోపనిషత్సారమును నిందుఁ బ్రతిపాదింపఁబడుటచే భారతము వేదాంతగ్రంథముగూడ నగుచున్నది.

నరనారాయణుల విజయము నభివర్ణించు మహాభారతము కావ్యమై కేవల కవికల్పనా రమణీయ మగుటయేగాక, యథార్థ వృత్త ప్రతిపాదనపరమగున యితివృత్తముగూడ నగుననుటకు సందియములేదు. కృతికర్తయగు వ్యాసుఁడే యందు సాక్షిభూతుఁడైన పాత్రము. కురుపాండవుల చరిత్రమునే గాక, యెందఱో పూర్వరాజుల చరిత్రమును వర్ణించు గ్రంథమగుట భారత మితిహాసము కూడ నగుచున్నది.

సప్తశతశ్లోకసమన్వితమగు శ్రీమద్భగవద్గీత మహాభారతము నందలి యనేక రత్నములలో నొక యనర్ఘరత్నము. అది గాంభీర్యమున నపారపారావారమును సైత మతిశయించుచున్నది. అది సర్వోపనిషత్సారమని సర్వమతములవారిచేతను గొనియాడఁబడినది. దాని యునికియే మహాభారతమునకు సర్వాతిశాయియైన వైదికగౌరవమును సంపాదించి పెట్టినది. మానవశరీరమునకు హృదయ మెట్టిదో మహాభారత విరాణ్మూర్తి కది యట్టిది.

శ్రీమన్మహాభారతమును గూర్చి నన్నయభట్టారకుఁ డెంత సముచితముగా వివరించెనో చూడుఁడు.

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదుల వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
ఆ. వివిధ వేద తత్త్వ వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.
ఆది. ప్ర. 32

విశ్వసాహిత్యములో మఱి యే యితర గ్రంథమునకు నిట్టి సర్వతోముఖ ప్రాశస్త్యము లేదు.

మహాభారతమును నన్నయ యింకను నెట్లు కొండాడుచున్నాడో చూడుఁడు.

శా. ఆ నారాయణపాండవేయగుణమా
హాత్మ్యములజ్యోత్స్నఁ జి
త్తానందం బొనరించుచున్ జనుల క
ర్ణాంశుప్రకారంబుతో
మానై సాత్యతేయ ధీవనధి జ
న్మ శ్రీమహాభారతా
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పునఖిలా
ఘధ్వాంత విధ్వంసియై.
ఆది. ప్ర. 21

ఇందలి మనోహర రూపకము వలన మహాభారతయశ స్సెంతయుఁ బ్రకాశించుచున్నది.

భారతపఠనమున కెట్టి ఫలశ్రుతి చెప్పఁబడినదో చూడుఁడు.

చ. అమల సువర్ణ శృంగఖుర
మై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహు వేదవిప్రులకు
దానము సేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారత క
థా శ్రవణాభిరతిన్. ...
క. బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థ
మగున్. ఆది. ప్ర. 17
సీ. ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు,
నర్థార్థులకు విపులార్థములును,
ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు,
వినయార్థులకు మహావినయమతియుఁ,
బుత్త్రార్థులకు బహుపుత్త్రసమృద్ధియు,
సంపదర్థుల కిష్టసంపదలును
గావించు నెప్పుడు భావించి వినుచుండు
వారల కిమ్మహాభారతంబు
ఆ. భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబు లెల్లఁ బాపి యిష్టార్థసం
సిద్ధిఁ గరుణతోడఁ జేయునట్లు.
ఆది. ప్ర. 34
మ. అమితాఖ్యానకశాఖలం బొలిచి వే
దార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్క పుష్పవితతిన్
శోభిల్లి, కృష్ణార్జునో
త్తమ నానా గుణ కీర్తనార్థఫలమై
ద్వైపాయనోద్యాన జా
త మహాభారతపారిజాత మమరున్
ధాత్రీసురప్రార్థ్యమై. ఆది. ప్ర. 66
సీ. ఇమ్మహాభారతం బిమ్ములఁ బాయక
విహితావధానులై వినుచునుండు
వారికి విపులధర్మారంభసంసిద్ధి
యగుఁ బరమార్థంబ యశ్రమమున
వేదముల్ నాలుగు, నాదిపురాణముల్
పదునెనిమిదియుఁ, దత్ప్రమితధర్మ

శాస్త్రంబులును మోక్షశాస్త్ర తత్త్వంబులు
నెఱిఁగిన ఫలము నెల్లప్రాప్తు

ఆ. దానములను బహువిధక్రతుహుత జప
బ్రహ్మచర్యములను బడయఁబడిన
పుణ్యఫలముఁబడయఁబోలు నశేష పా
పక్షయంబు నగు శుభంబుఁ బెఱుఁగు.
ఆది. ప్ర. 72

ఉ. సాత్యవతేయవిష్ణుపద
సంభవమైవిబుధేశ్వరాబ్ధి సం
గత్యుపశోభితంబయి జ
గద్విదితంబగు భారతీయ భా
రత్యమరాపగౌఘము ని
రంతర సంతత పుణ్యసంపదు
న్నత్యభివృద్ధి సేయు విని
నం గొనియాడిన నెల్లవారికిన్.
ఆది. ప్ర. 73

శా. ఆయుష్యం బితిహాసవస్తుసముదా
యం బైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తినిమిత్త ముత్తమసభా
సేవ్యంబు లోకాగమ
న్యాయైకాంతగృహంబునాఁబరఁగినా
నా వేద వేదాంత వి
ద్యాయుక్తంబగుదానిఁ జెప్పఁదొడఁగెం
దద్భారతాఖ్యానమున్. ఆది. తృ. 11

పయి ఫలశ్రుతులనుబట్టి మహాభారతము నౌన్నత్యమును జక్కఁగాఁ దెలిసికొనవచ్చును.

కేవల ఋగాదులగు నాలుగు వేదములే కాక, తత్సంబంధులగు బ్రాహ్మణములు, నారణ్యకములు, నుపనిషత్తులు, స్మృతులు మున్నగుఁగల వైదిక వాఙ్మయమంతయు నేకార్థమునే ప్రతిపాదించు నదియైనను వీనిలో భిన్నమార్గములు లేకపోలేదు. వేదములోనే యొక్కచో నొక యజ్ఞమునకును, మఱియొక్కచో నింకొక యజ్ఞమునకును, నొకచో నొక దేవతకును, వేఱొకచో నింకొక దేవతకును ననియతముగాఁ బ్రాధాన్యముండుట గోచరించును. అట్లే యుపనిషత్తులలోను కేవలజ్ఞానమున కొకచోటను, భక్తిపూర్వకజ్ఞానమునకు వేఱొకచోటను ప్రాధాన్యము. ఎవరి బుద్ధివిశేషమునుబట్టి వారికా మార్గములు స్ఫురించుట చేతనే తొలుత నొక్కటియే యైన వేదమతము ద్వాపరయుగము నాఁటికి బహుముఖముయినది. ఈ బహుముఖస్థితికి ఫలితముగా ననేక వాదములు బయలుదేఱినవి. సాంఖ్యమని, యోగమని, కర్మాచరణమని, జ్ఞానమని నానాసిద్ధాంతములు నానాశాస్త్రములుగా వెలసినవి. తమ మార్గమే యుత్తమ మనెడి యే యాచార్యుఁడును వీని కేకత్వమును సాధించుటకుఁ బ్రయత్నము చేయలేదు. ఆ మహాకార్యమును సాధించినవాఁడు మహాభారతకర్త. అతని దృష్టిలో దేవతకును దేవతకును నంతరము లేదు. భక్తి జ్ఞాన కర్మములలో హెచ్చుకుందులు లేవు. సాంఖ్యమునకు, యోగమునకుఁ బోరాటము లేదు. ఈవిధముగా సర్వమార్గసమన్వయమును, సర్వసిద్ధాంత సామరస్యమును, సర్వ ధర్మానుగుణ్యమును నీ మహాగ్రంథమునందు సాధింపఁబడినవి కనుకనే దీనికిఁ బంచమవేదమని పేరు వచ్చినది. దీనిని ధర్మాద్వైతమూర్తి యనుట మేలు. ఈరహస్యమును గ్రహించిన వాఁడు గనుకనే తిక్కన సోమయాజి—

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితా
వేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సం
భావ్యాను భావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితని
ష్ఠం బూని కావించెద ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లే
ఖ్యం బైన యామ్నాయమున్.

క. వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబునకున్
వాదైనచోటులను దా
మాదల ధర్మార్థకామ మోక్షస్థితికిన్.
విరాట. ప్ర. 4

అని దాని సర్వోత్కృష్టత్వమును స్థాపించినాఁడు.

మహోదధి మథనమునఁ జతుర్దశరత్నము లావిర్భవించె నని జనశ్రుతి. కాని మహాభారత సముద్రాలోడనము వలన నసంఖ్యాకములగు గుణరత్నములు నిత్యనూతనములయినవి యావిర్భవించుననఁ దన్మాహాత్మ్యము నెవఁడు వాకొనఁగలఁడు?

ఎచ్చట నేది వర్ణింపఁబడినను నది మహాభారతమునందలిదే యగును. అందు లేనిది మఱి యెచ్చటను లేదు.

'యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి న తత్ క్వచిదితి' యనుట కిదియే హేతువు.

వ. 'ఇట్టి మహాభారతంబు ననేకవిధ పదార్థప్రపంచసంచితంబు నుపపర్వమహాపర్వోపశోభితంబు నుపద్వీపమహాద్వీప సంభృతంబయిన భువనం బజాండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోక హితార్థంబు' ... ఆది. ప్ర. 67

నిర్మించెనని వాగనుశాసనుఁ డనుట ప్రత్యక్షరసత్యము.

సురభారతీ లీలానికేతన కేతనముం బోని యీమహాభారతము భారతీయ సాహిత్య సదనమును సమలంకరించుచు, నధ్యేతల యంతఃకరణముల నమలినములను జేయును.

పార్థునివలె నపార్థ పురుషార్థాభిమానము నుత్సర్జించి, సర్వాత్ముఁడగు శ్రీకృష్ణుని సర్వాత్మనా యాశ్రయించి, స్వీయజీవన రథరశ్ముల నుంచువాఁ డిహలోకమున నఖిల శత్రువులను జయించి, యంతమున నా భగవంతునిఁ బొందు ననుమహాభారతమహోపదేశ మెవ్వరును విస్మరింపరానిది.

['వ్యాసభారతము - నన్నయ పరిష్కారము' అను పరిశోధక గ్రంథము నుండి]

---

# ఈ పక్షంలో

## కీ. శే. కవిసార్వభౌముల జయంతి సభ

22-10-78 ఆదివారం సాయంకాలం రాజమండ్రి అల్యూమినియం అసోషియేషన్ హాలులో జరిగిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి 113వ జయంతి సభకు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి అధ్యక్షత వహించారు. శ్రీ కోడూరి శ్రీరాములు (గుడివాడ) సభను ప్రారంభించగా అష్టావధాని శ్రీబులుసు వెంకటరామమూర్తి పద్యములతో సభముగిసింది.

నాటి ఉదయం మ్యునిసిపల్ ఆఫీసు ఆవరణలో గల శ్రీకృష్ణమూర్తి శాస్త్రి విగ్రహానికి శ్రీరామేన బ్రహ్మం దంపతులు శాస్త్రోక్తంగా గురుపూజచేసి ఆహూతులను ఫలతాంబూలాదులతో సత్కరించారు.

సాయంత్రం సభలో 'శ్రీశాస్త్రి గారు వ్యక్తిగా సాహిత్యఅభిమానుల నే సంస్థను రూపొందిచారనీ తనకు ఉద్యోగమిప్పించిన ఉదారు లనీ మహాకవి మధునాపంతులవారు వారి గుణగణాలను శ్లాఘించారు. సర్వశ్రీ ఎం. బాలసుబ్రహ్మణ్య శర్మ, చేబోలు చిన్మయ బ్రహ్మకవి, డా. సి.కృష్ణమాచార్యులు, జయంతి వెంకటశాస్త్రి, మెరపల సన్యాసిరావు, మల్లంపల్లి దుర్గాప్రసాదరావు, జాతీయ కవి శ్రీపాద వెంకట సోమయాజులు కె.వి. రత్నం ప్రభృతులు శ్రీశాస్త్రి గారి గుణగణములనూ, కవితా పాండిత్యప్రాగల్భ్యలనూ ప్రశంసించిరి.

శ్రీమతి కల్లూరి సీతామహాలక్ష్మి తాత గారి భాగవతరచనలోని కొన్ని పద్యాలను సౌందర్యలహరిస్తోత్రమును, శ్రావ్యముగా చదివి వినిపించిరి. శ్రీ కల్లూరి సత్యనారాయణమూర్తి నూతనవస్త్రములతో శ్రీమధునాపంతులవార్ని సత్కరించారు. శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రి వందన సమర్పణ చేసిరి.

ఈ సందర్భంగా శ్రీ శాస్త్రి గారి జీవితవిశేషాలలో కొన్నింటిని యిందు పొందుపరుస్తున్నాం.

కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు పశ్చిమ గోదావరిజిల్లా యర్నగూడెం వద్దగల దేవరపల్లి గ్రామంలో 1866 లో జన్మించారు. బాల్యం కాటవరంలో గడిపారు.

సలక్షణఆంధ్ర వాఙ్మయాన్ని అమృతాహారంగా అందజేసిన మహానుభావులు. శ్రీశాస్త్రి గారి ముద్రితగ్రంథములు 250కి పైగా ఉన్నాయి. తిరుపతి వెంకట కవులలో శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి వీరి శిష్యులు. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు ద్వితీయఆస్థానకవిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే గుర్తింపబడ్డారు. శ్రీశాస్త్రిగారి రామాయణ, భారత, భాగవతాది గ్రంథములేకాక గణేశపురాణమూ మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. వీరి బొబ్బిలియుద్ధ నాటకాన్ని తరచుగా ప్రదర్శించేవారు. సంస్కృతంలో ఉన్న అనేక గ్రంథములను తెనిగించారు. వీరిభాష సరళగ్రాంథికము. మాట్లాడటానికే తప్ప వ్యావహారికాన్ని రచనలలో ఉపయోగించరాదనేది వీరి వాదం.

గౌతమీ మాసపత్రిక, మానవసేవ, వందేమాతరం, వజ్రాయుధం మున్నగు పత్రికలను నడిపారు. మద్రాసులో కళావతి ముద్రణాలయమును నిర్వహించారు. 1933లో పాలకొల్లులో కనకాభిషేకం పొందిరి. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలో గండపెండేరమును తొడిగించుకొని దర్శిలా ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు బహూకరించారు. మహామహోపాధ్యాయ ఇత్యాద్యనేక బిరుదాంకితులు. రాజమహేంద్రవరంలో సుదర్శన భవనంలో జీవితాంతం ఉండి తమ 94 వ ఏట 1960 లో పరమపదించారు.

– శ్రీ సత్యవోలు వరప్రసాదమూర్తి.

## శతాధిక గ్రంథకర్త శ్రీ బులుసు వేంకటేశ్వరుల జన్మదినోత్సవ సాహిత్య సభలు

కాకినాడ, అక్టోబరు 23.

దివ్యజ్ఞాన సమాజము (గౌతమలాడ్జి) కాకినాడవారి యాజమాన్యమున ఈ నెల 18వ తేదీ బుధవారమునుండి ఐదు రోజులు శతాధికగ్రంథకర్త, ఆర్షకవి శిరోమణి కాకినాడ శ్రీ అన్నవరం సత్యవతీదేవి స్త్రీల ప్రభుత్వ కళాశాలలో ఆంగ్లశాఖాధిపతి శ్రీ బులుసు వేంకటేశ్వరుల 62వ జన్మదినసభలు, సాహిత్యసభలు జరిగినవి. ఐదురోజులూ పురవాసులకు సాహిత్యపర్వదినములు. శ్రీ వేంకటేశ్వరుల 116 గ్రంథముల ప్రదర్శనము ఐదుదినములు జరిగినది.

18వ తేదీ బుధవారం జన్మదినసభ పౌరసభ యైనది. శ్రీమతి పుణ్యమూర్తుల లక్ష్మీకుమారి శ్రీవేంకటేశ్వరుల గ్రంథములందు గల భక్తి పద్యముల గానము చేయుటతో సభా ప్రారంభమైనది. పి. ఆర్. కాలేజీ మాజీ ప్రిన్సిపాలు శ్రీ పిరాట్ల శ్రీరామంగారు అధ్యక్షత వహించి సభా ప్రారంభము గ్రంథ ప్రదర్శన ప్రారంభము చేయుచు ఇలాఅన్నారు.

“శ్రీ వేంకటేశ్వరులు శతాధిక గ్రంథకర్త. ఆయన కృతులన్నీ నిర్దుష్టం, సులభం, సుందరం అయిన భాషలో నడిచేయి. ఇన్నివిధాల సారస్వత సేవచేసిన వ్యక్తి మరొకరు లేరు రామాయణభారత భాగవతాది సద్గ్రంథాల్ని సులభ సుందరంగా రంచించి, ఒకరి సాయం కోరకుండా స్వయంగా ప్రకటించి ఆయన మనకూ భాషకూ మహోపకారంచేశారు. ఆయన సేవ నిస్వార్థం, ఆయన మనస్సు నిర్మలం, ఆయన హృదయం విశాలం, ఆయన రచన లన్నీ శాశ్వతాలే. ఆయన ఋషి. ఆర్షకవి శిరోమణి. ఉదాత్త భావాలు, ఉత్తమశైలి, ఆయన వి.

భావంలో, భాషలో, ఇతివృత్తంలో, రసంలో, ఛందంలో, ఆయన రచన లన్నీ పరమ పవిత్రాలు. వానిద్వారా ఆయన చిరంజీవి." అన్నారు. సోదాహరణంగా శ్రీబులుసువారి కవితారమ్యతని ప్రశంసించారు.

పౌరుల పక్షమున శ్రీ యస్. సూర్యనారాయణమూర్తి శ్రీ వేంకటేశ్వరులని సత్కరించి సన్మానపత్రం చదివి సమర్పించారు. శ్రీ శ్రీనివాసరావు అభినందించారు. హైదరాబాదు వాస్తవ్యరాలు శ్రీమతి కస్తూరి స్వరాజ్యలక్ష్మి "శ్రీ వేంకటేశ్వరులు దైవాంశసంభూతులు. ఆధునిక వ్యాసమహర్షి. కారణ జన్ములు కాకపోతే ఇన్ని మహాగ్రంథాలు ఇంత ఉత్తమంగా రాయలేరు. ఆయనతోడి మైత్రి నామహాభాగ్యము. ఆయన మాట, చేత, రచన, అన్నీ సహజ గంభీరాలు. ఉదాత్తాలు" అని ప్రశంసించారు.

శ్రీ వేంకటేశ్వరులు స్వీయ వాల్మీకి రామాయణ కావ్యగానం చేసి సభ్యుల్ని తన్మయుల్ని చేశారు.

రెండవరోజు అభినందనసభ శ్రీ రాజయోగి అధ్యక్షతను జరిగింది. శ్రీ రాజయోగి శ్రీ వేంకటేశ్వరుల పంచవిధ తపస్సులను వర్ణించి, ప్రశంసించారు. శ్రీ మాచిరాజు సీతాపతిరావు, న్యాయవాది సుబ్రహ్మణ్యశర్మ శ్రీ వేంకటేశ్వరుల సాహిత్యజీవితాన్ని శతధా ప్రశంసించారు.

శ్రీ వేంకటేశ్వరులు స్వీయ దేవీభాగవతావతారికను, శుక చరిత్రను చదివి వినిపించి సభ్యుల్ని సంతోషపరిచారు.

మూడవరోజు స్త్రీల సభ. మనోజ్ఞ కంఠాలతో శ్రీ వేంకటేశ్వరుల కృతుల నుండి ప్రార్థన పద్యాలను శ్రీమతి పి. లక్ష్మీకుమారి, కుమారి నాగరాజ్య లక్ష్మి గానంచేశారు. శ్రీమతి నేత్రకంటి రమాదేవి సభాధ్యక్షత వహించి శ్రీ వేంకటేశ్వరుల ఆధ్యాత్మికతను, కవితాకమనీయతను ప్రశంసిస్తూ ఆయన రచించిన శ్రీ వేంకటేశ్వర విజయాన్ని గూర్చి ముచ్చటించారు. కుమారి బి. లక్ష్మి గురువుపై ఆంగ్ల పద్యములు వ్రాసి మనోజ్ఞంగా చదివి సమర్పించింది. కుమారి జోశ్యుల జానకి స్త్రీల పక్షాన్ని, విద్యార్థినుల పక్షాన్నీ శ్రీ వేంకటేశ్వరులని కాశ్మీర శాలువలతో, ఫలపుష్పహారములతో, భక్తిప్రపత్తులతో సత్కరించింది.

శ్రీ అన్నవరం సత్యవతీదేవీ స్త్రీల ప్రభుత్వకళాశాలా విద్యార్థినీ సంఘాధ్యక్షురాలు కుమారి ఎల్లారమ్మ శ్రీ వేంకటేశ్వరుల మహోత్తమ గురువాత్సల్యాన్నీ ఉదాత్త కావ్యరచయితృత్వాన్ని ప్రశంసించి, ఆయన మహాకవి, మహావాజ్మి మహాత్ముడు అని ప్రశంసించింది. శ్రీమతి స్వరాజ్యలక్ష్మి శ్రీ వేంకటేశ్వరుల కృతులు చదివి ధన్యులుకండని స్త్రీలను హెచ్చరించారు.

శ్రీ వేంకటేశ్వరులు స్వీయ రామాయణ కావ్యగానం చేశారు.

నాలుగవరోజు సభకు శ్రీ వేంకటేశ్వరుల భారతభాగవత రామాయణాల్ని స్థానిక త్రిపురసుందరీ దేవాలయంలో నిత్యం పురాణ ప్రవచనం చేస్తున్న శ్రీ రాళ్ళబండి సత్యనారాయణశాస్త్రి అధ్యక్షత వహించి పూర్వకవుల రామాయణ భారత భాగవతపద్యాలు, శ్రీవేంకటేశ్వరుల రామాయణ భారతభాగవత పద్యాలు చదివి తులనాత్మక పరిశీలనచేసి శ్రీ వేంకటేశ్వరుని కవితామాధుర్యాన్ని ప్రశంసించారు.

శ్రీకందుకూరి రామచంద్రమూర్తి శ్రీ వేంకటేశ్వరుల ఆంధ్రుల తపఃఫల మనీ, ఆయన వ్యాసాపరావతారమే అని ప్రశంసించి శ్రీ వేంకటేశ్వర విజయాన్ని గూర్చి మాట్లాడారు. శ్రీ పరవస్తు గోవిందాచార్యులు శ్రీ వేంకటేశ్వరాంధ్రీకృత వేణీ సంహారాన్ని గూర్చి మాట్లాడారు.

శ్రీ వేంకటేశ్వరులు స్వీయ వేంకటేశ్వర సంకీర్తనశతకాలనుండి పద్యాలుచదివేరు.

ఐదవరోజు సభకు రిటైర్డు ప్రొఫెసర్ శ్రీ నేమాని వెంకటరావు అధ్యక్షత వహించి శ్రీ వేంకటేశ్వరు లొనరించిన చిరస్థాయియైన భాషాసేవను శ్లాఘించారు. శ్రీ కందుకూరి చినరామచంద్రమూర్తి వేంకటేశ్వర విజయాన్ని గూర్చి శ్రీనందుల గోపాలకృష్ణమూర్తి శ్రీ వేంకటేశ్వర మహాభారతాన్ని గూర్చి ప్రసంగించారు.

శ్రీ వేంకటేశ్వరులు అందరికి కృతజ్ఞత లర్పించి ఇలాఅన్నారు.

"గురుకటాక్షం వల్ల ఇంటావంటా లేని కవిత్వం వరించింది. దైవకటాక్షం వల్ల మహాగ్రంథసముద్రాల్ని ఆపోశనపట్టడం జరిగింది, ఇందులో నాప్రజ్ఞేమీ లేదు. ఇంతమంది సహృదయులు మెచ్చుకోడం నా మహాదృష్టం. సరస్వతీదేవి కటాక్షం దైవకటాక్షం. అది లభించటంతో నాకు పరమతృప్తికలిగి యితరుల గౌరవాల వ్యర్థత్వం స్ఫుటంగా నాటింది. చేసినపనితోడి సోదరులు మెచ్చుకుంటే సంతోషం. లేదా మరీ సంతోషం. నా విలువ నాకు తెలుసు. నేనాశ్రయించిన కల్పవృక్ష కామధేను చింతామణుల విలువ నాకు తెలుసు. కనుక, ఇతరుల లక్ష్యాలక్ష్యాలతో నాకుప నేముంది?" అన్నారు.

స్వీయ వేంకటేశ్వర విజయ కావ్యగానం చేసి అందరినీ శ్రీ వేంకటేశ్వరులు తన్మయుల్ని చేశారు.

శ్రీ కామర్షి సత్యనారాయణవర్మ వందన సమర్పణ చేశారు.

ఐదురోజుల సాహిత్యపు పండుగలు చక్కగా ముగిసి పౌరులకి నవచైతన్యం కలిగించేయి. — కుమారి జానకి.



# చంద్రకళ

– శ్రీ ఆచార్య యస్వీ జోగారావు

రాకాశీతమయూఖరేఖ శివరాత్ర్యధ్యాత్మనిష్ఠా నివి
ష్టైకస్వాంతమునం దొకప్డు స్థిరతిష్ఠత్కోటిసౌదామనీ
సాకల్యప్రభఁ దోఁచెఁ దోడన మహాచైతన్యమాత్రస్పృహా
కాకారంబుగ సర్వవిగ్రహము సంస్తంభించెఁ జిత్రంబుగన్.

కాలాడదు కే లాడదు,
ఆలింపవు వీనులు, పలు కలరదు, కను లా
త్మాలోక పరాయణములు
జీలుగువలె మూల్గు లోన జీవుఁ డొకండై.

ఇచ్చ ముచ్చముడిగెఁ బడగెత్తి లేచె
నచ్చ తెలివి మాత్రము పురహరుని మేన
ఫుబుస మాడ్చి కాణాచి యగు తన పుట్ట
దరిని బరిమీఁద నాడు పెంద్రాచు పగిది.

శంకర జటా విటంకా
లంకార శశాంక నిష్కళంక కళన్ స్మృ
త్యంకముగాఁ దాల్చిన మది
మంకెనలే పూచె నేఁడు మత్పుణ్యమునన్.

రాజకలైక భూషణుఁడు, రాజమనోహరుఁ డద్రిరాజక
న్యాజలజోదయార్కుఁ డదయార్కతనూజవచఃప్రచండకం
ఠాజిర కాలకూటము జటాపటలాభ్రధునీతరంగ వి
భ్రాజితదివ్యలింగము శుభాంగముమాకుఁ బ్రసన్నమయ్యెడున్.

శిష్టవిశిష్టవశిష్ఠు లస్మద్భార్గ
వాన్వయర్షులు శివభక్తిపరులు
తాతపాదుఁడు మహాద్వైతి యగుఁ దథాఽపి
తరుణేందుశేఖరతత్పరుండు
మా కులస్వాము లనేక మహాకవు
లీశ్వరార్చనకళాభీష్టహృదులు.
అస్మద్గురువులయం దాస్తికు లగువారు
చిత్తనిత్యస్థితశివులు మివుల

క్రొత్తగా నేనుగాఁ దెచ్చుకొన్న దేమి?
తరతరాల మదీయ సంతానమునకు
పూర్వు లిచ్చిన యాస్తిఁ బువ్వులను బెట్టి
అప్పగించుటకన్న కార్యం బిఁ కెద్ది?

చిన్ననాఁటనుండి శివమహాభక్తుండ
నాస్తికుండ నైతి నడివయసున
పట్టి యాస్తికతను వడఁగట్టి తెట్టులోఁ
దీర్ఘయాత్ర లెన్నొ తిరిగితిరిగి.

బ్రాహ్మముహూర్త శుభ్రస్నానపూతంబు
ద్వాదశాతత పుండ్ర ధవళితంబు
అవతంస బిల్వకర్ణాభ్యర్ణదేశంబు
రుద్రాక్షమాలికారూఢగళము
కూపోదకక్లిన్న కౌపీన వస్త్రంబు
చారుపద్మాసనవీర మఠము
మహిత పంచాక్షరీ మంత్రముహుర్ముహు
ర్ముఖరిత స్వాంతసమ్ముఖము ముఖము
దేహమే మహాదేవుని దేవళముగ
సాగినట్టి శైశవవీరశైవదీక్ష
నేఁడు తలఁచుకొన్నపుడు కన్నీళు లురలు
నవి ముదశ్రువులో శుగశ్రువులొ గాని

మృడుఁ జూడ గుడుల కెన్నఁడుఁ బోను, పెఱచోట్ల
గిరిజేశునిక్క శంకింప లేను
పూజాపురస్కారములు చేయుటలు లేదు
పాపాలొనర్పఁ బాల్పడుట లేదు
మ్రొక్కుబడులు ముడుపులు కట్టఁగాఁ బోను
గొంతెమ్మ కోరికల్ కోరఁబోను
శివకోటి గిలుక నచ్చిక లేదు వాఙ్మయ
వ్యాసంగమునఁ దీరుబాటు లేదు
అసలు శివుఁ డెక్కడో నక్క ననుచుఁ దలపఁ
సర్వగతుఁ డనియుఁ దలపఁ, సరవిఁ జూతు
కనులు మూసి నా కనిపించు కళలలోన
నార్తజనుల సకృద్దరహాసములను.

ఇంతగా నేడ్చెద నెవ్వఁడా శివుఁడు?
అంతరంగములోని యరులకున్ మగఁడు
కైలాసవాసుఁడా కాఁడు భూరి కరు
ణాలవాలమృదులస్వాంతావసథుఁడు
చంద్రచూడుఁడు కాఁడు జగ ముద్ధరించు
సాంద్రపుజ్ఞానంపుఁ జల్లని వెలుఁగు
వామార్ధసతి కాఁడు ప్రణయాభిరామ
భామార్పితాఖిల స్వామ్యమ్మువాఁడు
గంగాధరుఁడు కాఁడు కరుణారసమ్ము
పొంగిపొరలెడు పొల్పునకు పునికిపట్టు
వెలిబూది పూసిన వెఱ్ఱియా కాఁడు
వెలితివేడ్కలు లేని విశ్వేశ్వరుండు.

దిసమొలాతఁడు గాఁడు దివ్యతత్త్వంబు
పస పసందుగ బట్టబయలైనవాఁడు.
నీలకంఠుఁడు. గాఁడు నిఖిలాశుభముల
హేలగా దిగమ్రింగి యిల నేలువాఁడు
ఫాలనేత్రుఁడు గాఁడు భక్తప్రపన్న
జాలారిభయద తేజఃపటిభ్రుకుటి.
ఢుండుభాంగదుఁడును ఢుబుఢుక్క గాఁడు
కుండలినీశక్తి కుద్బోధకుండు
నందివాహుఁడు గాఁడు నానాశ్రితనత
వందారుబృందావనవరతానపాయి
కర్వునఁ బోసిన కాశ్రేఁడు గాఁడు
సర్వసంగత్యాగి సర్వమంగళుఁడు
ఎంతగా నేడ్చిన నీతఁడే శివుఁడు
స్వాంతైక సామ్రాజ్య సర్వస్వభవుఁడు.

ఎంతో అక్కసుతో నొకొక్కపుడు నే నెంతుంగదా చెల్లి! స
ర్వాంతర్యామి సనాతనుం డమృత సౌహార్దాత్ముఁ డైనట్టి మా
కంతున్ గాదనుస్వామినింత మమతన్ గామింతు నేమీ యటం
చింతా చూడఁగ నిర్వురున్ సరసులే యేకాత్మసంస్థాయులే.

చేతోభవుఁడు జగద్ధితుఁ
డాతఁడు; చేతోధవుఁ డితఁడ జగద్గురుఁడున్
అతని కరము స్పృశించెద
నీతనికిం జేతులెత్తి యెరఁగుదు నెపుడున్.

అలరమ్మ వలఁతికిఁ గలిసివచ్చిన యట్టి
అమ్మవయిపువారి యాస్తి గాదు
శివు నావహించిన శ్రీమన్మహాజగ
జ్జనయిత్రి స్వచ్ఛ చిచ్ఛక్తి గాని
జగ మెల్లఁ జల్లగా జను లుల్లసిల్లగా
విలసిల్లు వేడుక వెలుఁగు గాదు
విశ్వతోముఖ శశ్వదీశ్వర నిత్య వి
నూతన తేజోవిభూతి గాని
అనుచు నెల్ల యంతర్దృష్టి లాకళించు
కొన్న యచ్ఛవెన్నెల యాలవెన్నఁబోని
యస్మదంతరంగము నెల్ల నలముకొనుచు
చిర శివంకర కవితయై చెలఁగుఁ గాత!

ఏఁటి కొక్కటే శివరాత్రి యెల్లరకును
నా కెపుడు శివరాత్రియో నీక యెఱుక
నెలకు ముప్పది పున్నమల్ నీకు నాకు
శేఖరీభూత శీతమయూఖరేఖ!

---

# నవరత్నమాల

- శ్రీ ఆర్. ఎం. చల్లా.

నా నవభావభారతివి, నా హృదయస్థితలక్ష్మివీవు, మ
త్ప్రాణ సమన్వితప్రియ భవానివి; మత్కవితాప్రభూత సం
స్థాన వినూత్న మోదమయ సంస్కృతికీ విలవేల్పవై మదీ
యానన, మానసా, ఉద్ధవపు రాశ్రితవైతి, త్రిమూర్తి గానొకో!
భవదనురాగసార మనవద్యరసామృత భావపూర్వమై
యవిరతమున్ మదీయహృద యాప్రహతస్థలిసాగు జేయగా,
నవనవకల్పితాగ్ర కవ నప్రియపల్లవ పుష్పసౌరభ
ప్రవిమలసాలజాలమగు రమ్యవనాంగణమున్ రచింపవా?

నా సవిలాసభావములు నవ్యకవిత్వవిరాజితంబులై
నీ సుమనోజ్ఞతన్ దెలచు నిర్మలగీతిక లాలపింపగా,
నీ సుకుమారపాదముల నేర్పుగవైచి మద న్తరంగ లి
ప్సా సరణిన్ సముజ్జ్వలపు భఙ్గిమలొప్పగ లాస్యమాడవా?
ఓ రమణీమణీ, సురుచిరోజ్జ్వల సున్దరశుభ్రరూపిణీ!
శారదచంద్రికాధవళ సౌమ్యమనోహరచేలధారిణీ!
చారుసుధామయప్రణయ జాగృతహార్దకళావిలాసినీ!
హారతినిమ్మ నాదుహృద యాలయమందున, భవ్య భావినీ!

మిలమిలలాడు మేనిపయి మెగ్గెడి మేదురమౌ సువాసనన్,
కలకలలాడుకన్నుల ప్ర గాఢనిగూఢనితాన్తకాన్తియున్,
కిలకిలలాడు పల్కు పలికించెడి తావక గీతిరావమున్,
తలచెద నామదిన్ సుమము, తారక, కోయిలకూతపోలికన్.
రా రతనాలప్రోవ, నను రంజిలజేసెడి రాగమాలికా!
రా రజనీవిభుప్రభకు రంగులనిచ్చు విచిత్రతారకా!
రా రసలీలలాడెడి స రాగవినోదిని, దివ్యగాయనీ!
రా రమణీయరాగమయ రమ్యసుహాసిని, మంజుభాషిణీ!

పాడినపాటయే మరలపాడెద; ఆడినఆటయే, అహా,
ఆడెద, నాదుపాటలకు నాటలకున్ చెలికత్తెవౌచు, నన్
గూడి యనేకజన్మములు, కోటియుగంబులు, చల్లచల్లగా
'ఆడుచుపాడుచున్' బ్రతుకు హోళిని బొందవ ప్రేమమూర్తివై?
నీ విమలాధరంబుపయి నిత్యమువెల్గు సుహాసదీప్తితో,
నీ వదనారవిందమున నెక్కొను స్నిగ్ధసుధార్ద్ర్య ధారతో,
నీ వరదేహవల్లిక జనించు సుమావలితో మదీయ హృ
ద్భావుక మణ్డపంబున సదా ప్రణయార్చన జేయనెంచవా?

నా పద్యాల పునఃప్రతిష్ఠకొఱకై నవ్యత్రిదేవ్యాఖ్య స
ద్రూప ప్రక్రియగా తలంచితిని నిన్; రుద్రాణివై తాపసా
లాపంబున్ వినిపించినావు; మదిలో లక్ష్మిప్రవేశంబుగా;
నా పూజాఫలమా కవిత్వదయితా, నాకావ్యకన్యాత్మజా!

---

# సమాలోచన

## — ప్రథమ సంపుటి వ్యాససూచి —

## కవితలు



## ఇంటర్వ్యూ



## కథానిక



## కథలు



* [1-13 వరకు ఒక సంపుటముగాను (1/8 డెమ్మీ సైజు) 14-24 వరకు ఒక సంపుటముగాను (1/4 క్రౌను సైజు) ప్రథమ సంపుటము సంచికలన్నీ హాఫ్ క్యాలికో బైండు చేయబడి యున్నవి. పోస్టేజితోసహా రు. 18/లు M. O. చేయు వారికి పైరెండు వాల్యూములు రిజిష్టర్డుపోస్టులో పంపబడును. వి. పి. గా పంపబడవు.]

ప్రతులకు : సంపాదకుడు "సమాలోచన"
6-8-7, ఇన్నీసుపేట, రాజమండ్రి - 1.

# కోసల ఏరువాక మహోత్సవము

— శ్రీ జయంతి వేంకటశాస్త్రి



చ. తొలకరివారివాహవితతుల్ చెలరేగిన యంబరంబులో
నెలకొనె దుందుభిస్వనము; నిర్మలవాయుతరంగరంగముల్
సలలితసౌరభంబు వెదజల్లెను కోసలరాజచంద్రుపై
వలగొని హేమకంకణరవంబుల సేసలువోసిరైదువల్

ఉ. సమ్మతికోస లావనిప్రజాసముదాయము వెంబడింప మి
త్రమ్ములు వాహనాళిసహితంబుగ గొల్వగ 'శ్రీజయోస్తు' రా
వమ్ములు పొంగ; బ్రాహ్మణులు పల్కిరి స్వస్తి, నగంబుచేరువన్
దమ్ము నొనర్పగా పొలముదాపున నేనుగు డిగ్గెరా జొగిన్,

ఉ. కోసలభూమిలో కృషినిగోరి యొకానొకనాడు రాజు వి
శ్వాసముతో కృషీవలుని పాత్ర ధరింపక మానరాదు సం
త్రాసము కల్గినన్ విడువరాదు మహేంద్రు పదార్చనమ్ము సా
వాసులు నన్యదేశ నరపాలురు సంతసమంది వెంటరాన్.

మ. గలుగల్లంచును కంఠదేశముల వీకన్ గంటలున్ మ్రోయగా
బలదర్పోద్ధత-పోటుబెడ్డ హాలపార్శ్వంబందు బంధించి యి
మ్ముల బంగారపు మేడిపై కరము మోపున్ రాజు భూభాగమున్
కలయన్ దున్నెడివేళ నంద మొలుకన్ కాంతాజనుల్ పాడగన్.

ఉ. పళ్ళెరమందు విత్తులను పొంతముజేయుచు రాజరాజుకున్
మెల్లన నందియిచ్చు ఘనమేదుర గౌరవమబ్బెనాడు సం
ఫుల్ల సరోజనేత్రికి ప్రభూతవిభూషిత కోమలాంగికిన్
పెల్లుగ రైతుబిడ్డకు విభీతకు కన్య మధూకమాలకున్.

చ. శ్రమను సహించి వారి కణజాలమునంటిన కేశపాళి శీ
ఘ్రమునకుద్రోచి సత్వరము రాజుకు నాటగ విత్తులిచ్చు సం
భ్రమమున, గాలివేగమున పయ్యెద జారగ సర్దుకొంచు ని
ర్మమత మధూకమాల పరమాద్భుత కార్యవిలోల గన్పడెన్.

చ. ముగిసె మహోత్సవం బతుల మోదనమై ప్రభువాంఛ కన్యకున్
నగదు బహూకృతిన్ పసిడినాణెము లున్నతి పళ్ళెరంబులో
నెగయగ నింపియిచ్చుటకు నేర్పరుపంబడె; కాన్కలంది యా
సొగసుది కండ్లకద్దుకొని చోద్యముగా విరజిమ్మె రాజుపై.

మ. అమితోత్తేజము బాలికాచరణకార్యం బెంచి యాజేని భా
వము తద్భ్రుకుటిపై నటింపఁగని, సేవానమ్రమయ్యె యామె యో
విమలోదార ప్రభూత్తమా! వినుము నావృత్తంబు ఈ పైతృకా
క్రమణంబైన పొలంబు నమ్ముటకు జాలన్, నన్ను మన్నింపుమా!

ఉ. కోసలరాజ్య గౌరవము కొల్పడకుండఁగఁగాచె మాగధీ
వాసికిఁ దీసిపోనిగతి; వానికి నీయమ పుత్రియౌనె పే
ర్వాసికి సింహమిత్రునకు; వాడుక నిట్టి మహోత్సవంపు వి
న్యాసమునన్ పరంపరగ నైన నియుక్తి యమాత్య! దెల్పుమా!

చ. నియమము సర్వసాధకము; నేల నృపాలుని యెన్నికైన దై
నయమున నాలుగింతలుగ నాటిన రొక్కము సేద్యగానికిన్
రయమున నీవలెన్ గొనుచు రంజిలి వత్సరమంత చూచుచున్
నయమున సంచరింపవలె నాటనుగోలె ప్రభుండు సామియౌ.

ఉ. కోసలరాజు డెందమునకున్ ఒకతీరిక కొంతశాంతిచే
కోసమయంబుచెప్పె; జయఘోషలతో సభలో జనంబు సం
తోసము తెల్పి స్త్రీయువసతుల్ జన లేచిరి; కాపుకన్నెయున్
వాసముజేరె సాంద్రతర పర్ణమధూకమునీడ భూమికిన్.